ప్రథమ పుష్పము ఓం

# శ్రీ భీమేశ్వర మహాత్మ్యము

లేక

## మహాకవి భీమన

గ్రంథకర్త:

వానపల్లి సత్యనారాయణాచార్య సిద్ధాంతి

కాపవరం

రామచంద్రపురం తాలూకా (తూ. గో.)



ప్రకాశకులు:

వానపల్లి అచ్చయాచార్యులు

కాపవరం

రామచంద్రపురం తాలూకా (తూ. గో.)

కాపీ హక్కులు] 1951 [రు 1-4-0



# భీమేశ్వరమాహాత్మ్యము

గ్రంథకర్త:

వానపల్లి సత్యనారాయణాచార్యులు (యంత్రసిద్ధాంతి)

కాపవరము తా॥ గో॥ జిల్లా.

1951



వెల 1-4-0

# సూచన

యీ శ్రీమేశ్వర మహాత్మ్యము దైవ కృపచే యిప్పటికి పూర్తి జేసి సృహుద్వరు లగు ప్రజలకు అర్పించితిని. సజ్జను లందరీ గ్రంథము సాదరించి నన్నానందింప జేతురని నానమ్మిక. యీ గ్రంథము పౌరాణిక మైనను నూతన పద్ధతుల సంస్కరించి పూర్వ పద్ధతుల చెడనీక పౌరాణిక సాంఘిక జానుపద చరిత్రాత్మక రాజకీయ మొద. లగు ప్రపంచ పరిస్థితులు చక్కంగా కూర్చి సందర్భానుగుణ్యముగా నడపితిని. డ్రామాలకు సినిమాలకు సరిపడునట్లు కథ కల్పించి పాటలు పద్యములు వచనములతో కథ కళగట్టునట్లు చేసితిని. యిది వరలో అనేక గ్రంథములు వ్రాసినను డ్రామాలు మాత్రము యిదే మొదట ప్రయత్నమనక తప్పదు. యిందలి పద్యములు పాటలు వచనములు వ్యక్తుల పేర్లు కథా కల్పన మొదలగు సర్వమును నా అనుమతి లేనిది యెవ్వరు వ్రాయుటగాని డ్రామాలు వేయుటగాని సినిమా తీయుటగాని యీమోస్తరు కథ కల్పించి సినిమా తీయుట గాని కవులు యీకథను కాపీచేయుటగాని చేయరాదు. అట్లు చేసిన వారిని ఇండియన్ అక్టు ప్రకారము చర్య తీసుకొని నానష్టమునకు బాధ్యు లగుదురు. గుణగ్రహణ పారీణులు రసమును గ్రహించి దోసగులున్న క్షమించ ప్రార్థన. నమస్తే ..

ఇట్లు
సర్వజన శ్రేయోభిలాషి
యెర్ర సిద్ధాంతి
తాపవరం
రామచంద్రపురం తాలూకా తూ. గో.

# పీఠిక

## తొలిపలుకు

గీ. ద్యుమణి పద్మాకరము వికసనము జేయు భంగి
కుముదములు హర్షమున నిచ్చు నమృతసూతి
అర్థితుడు గాక జలమిచ్చు నంబుధరుడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు.

అను భర్తృహరి న్యాయానుసారి యీ [illegible]మేశ్వరమాహాత్మ్యము నేను రచించు [illegible] యీ క్రింద నగుపరచిన సహృదయుల సహాయమునే [illegible] లనదగు మహోత్తముల చేయూతచేతను [illegible] మహాగుణ సంపన్నులగు [illegible] వి. రమణయ్యగారికి నాయందుండు ప్రేమచేతను యీ చిన్న గ్రంథము నచ్చొత్తించి సహృదయుల హస్తములందలంకరింప జేయుటకు కారణము కవులకు సరస్వతి ప్రసన్నమే గాని లక్ష్మి ప్రసన్నము శూన్యము. రెండునూ కలసి యున్న మహానుభావు లరుదు. అందుచే మనభారత మాత గర్భమున గల్గిన విజ్ఞాన సంపన్నులగు కవులెందరో [illegible] గునవడి తమ భారములు తమలో నిల్పుకొని కన్నీటిధారలు విడచుచు నిరుత్సాహముతో వెనుక బడియుండిరని శ్రీమంతులగు విజ్ఞానులకు తెలియునుగాని చేయూత మాత్రము సున్న. అట్టి వారు చేయూత నొసంగిన భారతావని అన్ని దేశములకన్న మిన్నయగునట్లు చేయగల షేక్స్పియరు టాగూరు వంటి కీర్తికాముల కన్న యెందరో మహా పండితులు వెలసియుందురు. కవులకు దరిద్రము కలిమిగలవారికి గర్వము అందుచే దేశమున కనిష్టము. అట్లుగాక మహనీయుల నంద



గ్రంథపోషకుడు :

సిల్లా సత్యనారాయణగారు

శ్రీయుత మహారాజ పోషకులు యీ గ్రంథ కర్తకు శాశ్వితముగా
వార్షికము నిచ్చు మహాసుభావులు

సీ॥ పైడిపాల గోత్రపరుడు నల్లాన్వయాం
బోధిచంద్రుడు ధరన్ పూర్ణయశుడు
చిన్నయ్య రెండవ సుతుడు శ్రీ కారుడు
సత్యనారాయణ సద్గుణాఢ్యు
శ్రీయుక్త సంపదల్ మదిన దీమణి
యైన వెంకట రమణ చిన్న సుతుడు
ధీర ధైర్యోదార శాంత గుణ విశేష
కారుడు వినయ సంపత్కరుండు
యొసగె నూట పదారులే మనసు ప్రేమను
పుత్ర పౌత్రాభి. వృద్ధిగా మేలయునట్లు
భీమ నాథుండు స్థిర కీర్తి ప్రీతినొసగ
వలయు నంచును గోరెద వాంఛతోడ.

శ్రీయుత నల్లా సత్యనారాయణమూర్తిగారికి ఆ భీమనాథుడు సకలైశ్వర్యము లొసగుగాక. మూ. గో. కాకినాడ తా. విజయ రాయుడుపాలెం ల్యాండుప్రొప్రైటరు.

కం. బొలిశెట్టి వంశరత్నము
నిలిపెన్ ప్రోత్సాహమొసగి నిర్నిద్ర కృపా
సీలుడు వెంకట రమణయ
కాలక్ష్మీవర్తు డొసంగు నైశ్వర్యంబుల్.

బాక్సుప్రెస్సు మేనేజరులగు బొలిశెట్టి వెంకట రమణయ్య గారి కుటుంబమునకు ఆ శ్రీరాముడిష్టైశ్వర్యము లొసగు గాక.

మహారాజ పోషకులు నేమాని సత్యంగారు లక్ష్మీ రైసుమిల్లు ప్రొప్రైటరు: వీరు గ్రంథ ముద్రణకై రు 50-0-0 రూపాయలిచ్చిన వారు. సరసులు, శాంతులుమూ.గో. రామచంద్రపురం తా॥ గంగవరం.

కం. నేమాని వంశరత్నము
శ్రీమాన్యుడు సత్యమనగ శ్రేష్టుడు ధరణన్

యీ మాన్య డొసగె నచ్చిన
కామాన్యన కొసగు రాము డైశ్వర్యంబుల్.

మహారాజపోషకులు మద్దిపోటి పద్మావతీదేవి గారు తూ. గో. మిర్తిపాడు. యీ తల్లి ఈ గ్రంథ ముద్రణకై ప్రప్రథముగా సత్కరించెను.

తే. శ్రీల కిరువగు సుందర శ్రేష్టురాలు
అన్నపూర్ణ సమాన మీ చిన్నితల్లి
మద్దిపోటాన్వయాంబోధి మాన్యురాలు
పరమ పావన గుణధామ పద్మావతీ సుధామ

శ్రీయుత మద్దిపోటి సుబ్బారావు పద్మావతి దంపతుల కారాము డష్టైశ్వర్యము లోసగు గాక.

రాజపోషకులు మ. రా. శ్రీ.

శ్రీయుత ములకల వీరరాఘవయ్యగారు, పంచాయితీ బోర్డు ప్రసిడెంటు [కోట.
,, చిట్టూరి గణేశ్వరరావుగారు, ఈ గ్రామం.
,, నడిపల్లి సుబ్బన్నగారి కుమారుడు వెంకట్రావుగారు, [మిర్తిపాడు.
,, ఆరుమళ్ళ వెంకట్రావుగారి కుమారుడు నాగరాజుగారు, [జాలిమూడి.

శ్రీయుత కోడూరి వీరయ్యగారి కుమార్డు మునియ్యగారు, కాపవరం.
,, మేడిపూడి రామస్వామిగారి కుమార్డు గంగయ్యగారు, రాపాక.
,, మాగంటి సోమన్నగారి కుమార్డు గంగాధరంగారు, రాపాక.
,, మండవల్లి సూరన్నగారి కుమార్డు వెంకటజలంగారు, రాపాక.
,, మేడిపూడి రామస్వామిగారి కుమార్డు సత్యనారాయణగారు, [గ్రామ మునసబు రాపాక.
,, కీలు జనార్ధనస్వామిగారి కుమార్డు రామానుజులుగారు, [రఘుదేవపురము.

,, నాగారపు లచ్చయ్యగారి కుమార్డు రామమూర్తిగారు, రాపాక.
,, మాధవరపు సత్తిరాజుగారి కుమార్డు శ్రీరామమూర్తిగారు,
[సెలపాక.
,, నల్లా చిన్నయ్యగారికుమార్డు వెంకన్నగారు,విజయరాఘుపాలెం.
,, నల్లా పెదశేషయ్యగారి కుమార్డు సూరయ్యగారు, కంట్రాక్టరు
[జగన్నాథగిరి.
,, కన్నంటి సత్యనారాయణ మూర్తిగారు, రాపాక.
,, మద్దూరి సత్యంగారు, తొర్రేడు.
,, చిగురుపాటి సుబ్బన్నగారి కుమార్డు వీరన్నగారు, వర్తకం
[ఉండూరు.
,, రావిపాటి వెంకటనరసయ్యగారి కుమార్డు విష్ణుమూర్తిగారు,
[పాలచర్ల.
,, కడలి సుబ్బారాయుడుగారి కుమార్డు వీరన్నగారు, జార్జిపేట.

## చందాదారులు

మహారాజశ్రీ

ఉప్పలగుత్తి సత్యనారాయణగారు, రాపాక.
మరికాల బసవయ్యగారికుమారుడు విరూపాక్షయ్యగారు, సీతానగరం
[ఆయుర్వేదఘనవైద్యులు.
మాదాల వెంకయ్యగారికుమారుడు రామచంద్రుడుగారు, తాడిపల్లి.
వేపకాయల చిన వెంకటస్వామిగారి కుమారుడు అప్పారావుగారు,
[కాంద్రేగుల.
చిట్టూరి వెంకయ్యగారికుమారుడు సుబ్బన్నగారు, మిర్తిపాడు.
మన్యంసూరయ్యగారికుమార్డురామారావుగారు, భూస్వామితొర్రేడు.
యాళ్ళ వీరాస్వామిగారికుమారుడు సోమన్నగారు, ఓసుమళ్ళ.
పర్వతిని వీరన్నగారికుమార్డు సూర్యనారాయణమూర్తి,కందులపాలెం
గుత్తుల శ్రీరామశాస్త్రి మాచరశీవారు, కొత్తపల్లివారిమెట్లు.

# ★ ఇందు వచ్చు పాత్రలు ★

## ప్రథమాంకము

కళింగమహారాజు కథానాయకుడు

గుణనిధి
సుగుణసాగరుడు } మంత్రులు

ప్రజలు—షాహుకారు

సుబ్బావధాని—సోమిదేవం

వెంకటశాస్త్రి—సుందరశాస్త్రి

రఘునాథశాస్త్రి—[illegible]

## ద్వితీయాంకము

మాచమ్మ

చెలికత్తెలు

రఘునాథశాస్త్రి

జోగన్నశాస్త్రి—వెంకటశాస్త్రి

సుబ్బావధాని—సోమిదేవం

సీత—పద్మ

సభాపతి—సభ

## తృతీయాంకము

భీమన—బాలులు

పెద్దమనుష్యులు

మాచమ్మ

భీమేశ్వరస్వామి—[illegible]

విశ్వపతిశాస్త్రి తద్దినము-4 బ్రాహ్మణులు

## చతుర్థాంకము

సీత

రఘునాథశాస్త్రి

[illegible]

మంత్రి

కళింగమహారాజు

ఇద్దరు మంత్రులు

సేవకుడు

[illegible]

[illegible]

మంత్రి

సైన్యాధిపతి

## పంచమాంకము

కళింగమహారాజు

1-2-3 4 [illegible]

భీమన

విక్రమదేవు

మంత్రి

సేవకుడు

పగటివేషగాండ్రు

రఘునాథశాస్త్రి

మాదిగవాడు

శ్రీరస్తు ఓం అవిఘ్నమస్తు

# శ్రీ భీమేశ్వర మహాత్మ్యము

## ప్రార్థన.

ఉ. శ్రీలకుపుట్టినిల్లు మణి చిత్రవికుంఠపురంబు లోపలన్
వేలుపు రేడు నల్వయును వేల్పుసమూహము నారదాదులున్
మేలు భళీయటంచు ఘన మిగారిన భక్తి చెలంగ గొల్చునా
పాలన పాలకర్త సురపాలుని విష్ణునిగొల్తు నామదన్.

గీ. శ్రీకాంత ముద్దు కోడలు శ్రేష్ఠమైన
భారతీదేవి నాజింహ బాదుకొనగ
వేడుచుంటి కవిత్వ దీధితు లొసంగ
రమ్ము కృతినేలి బ్రోవ రయంబుగాను.

## ప్రథమాంకము

[రాజస్థానము నృత్యగీతములతో రాజకళింగగంగు మహారాజునకు హారతి పళ్ళెముతో స్త్రీలు వచ్చుట.]

కీర్తన - మోహన - దుర్గామిశ్రమం.

1. జయజయ భారతవీరా ॥జ॥
2. జయకళింగ నృపజయమేరా ॥జ॥
3. విజయమునీకే విపులధరావర
సుగుణభూషణా సుగుణావన శ్రీ ॥జ॥

4. అతులితగుణ శౌర్యా ఆర్త జనావన భరణా
నుతులుజేయ సామంత నృపులు నీ గతులు నెరిగి వర్తింతురు
సర్వులు. ॥జ॥
5. విక్రమార్క జయదేవ నశోకుని విశ్రుతగుణములు నీకలరారె
విక్రమమున జయభేరులు మ్రోగగ వీనులలరె నీ రాజ్యము
సర్వము ॥జ॥

కళింగరాజు—(సభ కలయజూచి) అమాత్యవర్యా! లోకముకంట
కావృతమగుచున్నది. ఏలనన్నా

ఉ. శాంతము ధర్మమున్ వినయసాహసవిక్రమ ప్రేమసత్యమున్
సుంతయు వీడకన్ ప్రజలజూచుచు నుండెడి రేని పృథ్విలో
పంతము వట్టి సాధుగోని పాపమటుంచక రాజ్యకాంక్షతో
వింతలు సల్పుచున్ జనుల వేసటబెట్టుట దేమిన్యాయమో.
వింటివా పూర్వము జయచంద్రుని కారణమున పృథ్వీరాజు
సార్వభౌముని విదేశవాసుల పురికొల్పి చంపినది మొదలు
నానారాజ విధ్వంసము గావించి దేశము హీనస్థితికి దెచ్చి పర
రాజహస్తగతంబు చేసిరి. దీనికి కారణము స్వార్థపరుల దుర్నీ
తియేకదా.

సుగు—ఔను. మహారాజా! స్వార్థపరులెంత పన్నులకయ్యినను దలపడు
దురు. ఔరంగజేబు జీజియాపన్నుగట్టి మనభారతజాతి నెంత
బాధించెనో, గంటిరా. స్వార్థపరులు ప్రభులనేమి ప్రజలనేమి
తనకోర్కెల దీర్చుకొనుటయే ప్రధానమని పాడుచేసిరి.
వారలే దేశాభివృద్ధికై పాటుపడిన దేశము హీనస్థితి గల్గదు.
పరరాజుల్ల పాలమురాదు.

గుణ—అదియేకాదు. యీ స్వార్థపరులే దుర్జనస ఘములోకలసి శిశు
బాలవృద్ధులను చిత్రవధలుజేసి నానాహింసలుబెట్టిరట.

సుగు—స్త్రీలనపహరించి సిగ్గుచేటుగల్పించిరి.

గుణ—అందులకే నాయకులేకమై కిక్కురుమనకుండ జేసిరి.

సుగు—భోగలాలసులయిన పూర్వప్రభులు తనప్రజలనే నిరుత్సాహముననజూచి నిరంకుశముగా ప్రవర్తించిరి.

రాజు—యిప్పుడుమాత్ర మీరాజ్యము శాంతచిత్తములోనున్నదా ?

సుగు—లేదు. పూర్వముకన్న యెన్నోరెట్లుపరిస్థితులు చక్కబడెనని యూహించుచుంటిని.

గుణ—మహారాజు మంచివారు. యథారాజా తథాప్రజా యన్నట్లు యజమానిననుసరించి కుటుంబమనుసరించి యజమానికి యింకనూ శత్రుబాధలు తీరలేదుగా !

సుగు—ఔను. మనమహారాజు విక్రమాదిత్యునిత్యాగము, జయదేవునిభక్తియు, అశోకుని ధర్మాదయయు, యీ మహారాజునకు మూర్తీభవించినవి.

రాజు—శత్రుబాధలేగాదు. గాలివానలు, సస్యనాశనము, ఆహారపు కొరత, లంచగొండితనము, అధికలాభవర్తకము, అవినీతి, పశులదురాగతము, ఆర్తజనరక్షణము, ధనికవర్గ మాదోపాయము, బీదరయితుల ఋణవిమోచనము యెన్నోసమస్యలు దీర్చ మనపై కెక్కినవి. వీట్లనుదీర్చుటకే విచారించుచున్న సమ్మయమ్మున దుర్జనములొకటి వెలసిప్రజలను ప్రభుత్వమును నానాశ్రమలు కల్గించుచున్నవి. నాకు మతిచలించుచున్నది.

సుగు—మహారాజా! తమమనోగతసంకల్పములనన్య శ్లాఘాపాత్రములు స్థిరయశోపేతము రాజ్యసౌభాగ్యము.

(బజారులో దుకాణము)

[తండులములకయి మాకు మాకు అని గోలచేయుచుండ లేదు లేదని ప్రక్కనుండి బియ్యపుబస్తాలు అధికలాభమునకు దొంగమార్కెట్టున అమ్ముట ప్రజలుచూచి]

1 ప్రజ—ఏ మండీ సావుకారుగారు కడుపు మాడి కంగారుపడి ప్రభులు బెట్టిన తండులాలు తలోచారెడయిన డబ్బిచ్చుకుని యిస్తారను కుంటే సంచులకు సంచులు యెనకాలే యెగేత్తుతున్నాయ్ యిదేమిపాపమయ్యా?

2 ప్రజ—కాదురా ఆరబ్బసొమ్ములాగ దొంగ బేరాలమ్ముచున్నాడురా.

3 ప్రజ—లచ్చలకులచ్చ వెలాగొత్తాయిరా. ఆలా లేక పోతే.

4 ప్రజ—బక్కోళ్ల కడుపు గోట్టితే గాని భాగ్యవంతు లెట్లు అగుతారురా?

5 ప్రజ—ప్రభులు యీలాటోళ్లని ఒకరిద్దరిని చంపితే యిటువంటి పనులు లేక పోవట్రో

6 ప్రజ—నీతిలే నోళ్లకు ప్రభులేం చేస్తారురా.

7 ప్రజ—కనకం చూచినా కాంతను చూచినావదల్లేరురా. అందులో సావుకారు బిడ్డ.

సావు—ఏం నేనేనా అధికలాభానికమ్ము చున్నానా? తప్పు. తప్పు. ప్రభువుగారి హుకుం మీదనే యిస్తున్నా. యీలాగ్గనండిమళ్ళీ

1 ప్రజ—యేంచేస్తావ?

సావు—యేంచేస్తానా?ప్రభువులతో చెప్పి చీరిస్తా?వురితీయిస్తా? జాగ్రత్త

2 ప్రజ—ఆ. పోవయ్యా.మమ్ములను మాడ్చిన డబ్బుతో మాన్యాలు కొంటున్నారు.

3 ప్రజ—వీళ్లుపోగుచేసేది మనరక్తమాంసాలేగా!ఎన్నాళ్ళు?మున్నాళ్లు ముచ్చటేగా!

సావు—మితిమీరుచున్నారు. జాగ్రత్త ఏంచేస్తానో.

5 ప్రజ—నీవుఏంచేస్తేవయ్యా?మేముచేస్తాము చూడు. (అనికలియబడి చిందర వందర చేసి పొడుకుంటూ ప్రభు సన్నిధి వత్తురు.

సావు—లబో! లబో! (అని) ప్రభులతో జెప్పి యేంచేస్తానో చూడుడు. యీనష్టం రాబట్టకపోతే నాపేరు పోలిశెట్టి కాదు. దరిద్రులు వున్నవాళ్ళనుచూచి ఏడ్వటమేమిటి? ధవలు? వీళ్ళబ్రతుకులింతే ఒక్కపూట లాభము లేదనుకుంటాను. నాకు లెక్కయేమిటి.

[ప్రజలు ప్రభుసన్నిధి వచ్చుచు కలసి]

పాట.

1. భారతభూమిని జననమొందితిమి బాధలుతప్పవి కేలా ॥భా॥
2. అరయ మొరలువిను మహానుభావులు ఆర్యావర్తనమున లేరా ॥భా॥
3. మానము ప్రాణము మంటగల్పి మము దీనులజేసిరి కేలా
ఆకలిమంటతో యటమటజెందియు ఆశలుదీర్చగ లేరా ॥భా॥
4. తల్లులు పిల్లలు మేడలు మిద్దెలు చెల్లె దూరమై మాకూ
కొల్లగ గొట్టెలగోయు కసాయులు మొల్లమయ్యె తుదకూ ॥భా॥
5. ప్రభువులు ప్రముఖులు బాగొనరించిన గానీ విభవము మనకే
విధి నెరవేరును వేదన చెందుటగానీ ॥భ॥

[ప్రభుసన్నిధికి జని నమస్కరించి]

1 ప్రజ—ప్రభూ! మాసంసారములు కొల్లగొట్టి మాస్త్రీలను పాడు చేయుచున్నారు.

2 ప్రజ—మాకొంపలు తగులపెట్టి నిలువనీడ లేకుండా చేయుచున్నారు.

3 ప్రజ—మాపశువులను యెత్తుకొనిపోవుచుమాపై మోపుచున్నారు.

4 ప్రజ—మా పదార్థముల అన్యాయముగ దోచుకుంటున్నారు.

5 ప్రజ—మా శిశువులను నెగరవేసి నరుకు చున్నారు. మాటలు కోటలు చేతలు మాటగుచున్నవి.

6 ప్రజ—మమ్ముల పసరములట్లు బాదుచున్నారు.

7 ప్రజ—పన్నులబాధలచే కుమిలిపోవుచున్నాము.

8 ప్రజ—రెండుదెబ్బలకు తట్టుకోలేకున్నాము.

9 ప్రజ—దేవర! ఆహారపరిమితికి వగాడుచున్నాము. ప్రభువులే అమ్మించవలెను.

10 ప్రజ—కడుపుమంట పరిమితి తగ్గిన కడుపునిండదు. సాపుకార్ల దళారీలు ప్రభూ!

11 ప్రజ—కలిగినవాని గాదితీయు; లేనివాని ప్రాణముతీయు.

12 ప్రజ—పెద్దవానికి శాల్యన్నము; మాకు నిరాహారము.

13 ప్రజ—అధికారుల ఆర్భాటము; మాకు ఆరాటము.

14 ప్రజ—మాబ్రతుకు లిట్లున్నది.

15 ప్రజ—రామరాజ్యము చేతురని మాఆశ.

16 ప్రజ—ఏలినవారి చిత్తము. మా అదృష్టము.

రాజు- ఉ. వేదనజెందె నాదుప్రజ లెవ్విధినైనను సంతసింపగా
బాధలుదీర్చి మీకికను పాలనజేతు కలంగబోకుడీ
మీదగు మానప్రాణములు మేలుగనుండెడియట్లుజేయ నా
సాధనమూహజేసితిని సంతసమొందియు జేరుడింట్లకున్.

ప్రజలారా! మీమీపనులప్రమత్తులై జేసుకొనుడు. మీసహాయమున ఆదుష్టరాక్షసులహంతకమూర్చి లంచగొండుల పరస్త్రీ పరధనాపహారుల శిక్షింపకున్న నామనంబూరటగల్గదు. నారాజ్యప్రజలు బాధలనుభవింప నాకు సుఖములేదు. లెండు లెండు. మంత్రి! చమూపతులారా! లెండు. ఆలసించెదరేల? ఆదుష్టులశిక్షింప ఆలసించిన మితిమీరుదురు. ఇదే శపథము చేయుచుంటిని. నానావిధసంఘము లనేకసంఘముగాజేసి సహోదరభావముగా మెలగునట్లుజేయకున్న నేకళింగమహా

రాజునేగాను. జై భారతమాతకు! (అని సింహాసనముదిగి వెళ్ళి అందరు వెడలుదురు.)

రంగము

[సుబ్బావధాని, సోమిదేవంబ ప్రవేశము.]

సుబ్బా—చెలీ! అపుత్రిశ్యగతిర్నాస్తి యనుస్మృతి ననుసరించి సంతానవిహీనలమై అనేకపుణ్యవ్రతములాచరించి పరమేశ్వరానుగ్రహంబున ఒక్కసుపుత్రికారత్నముద్భవించినది. మద్వంశము పవిత్రతనొందెనని సంతసించుచుంటిని.

సోమి—నాథా! నాకును చిరసమయకేదారంబు ఘనోదయంబగునట్లు యీబాల సప్తవత్సరములదైనను ఒక్కనిముసము విడిచి జనవాయుచలన దీపకలికయువోలె తహతహపడుచుందును.

సుబ్బా—కాంతా! మన కిట్లుండుటకు కారణమేమందువా చిరకాలము దనుక సంతానము కొరతయై మద్భాగ్యవశంబున యిప్పుడీ బాలఉద్భవించ యింతప్రేమంబంకురించెగాని వేరొండుకారణమేమున్నది.

సోమి—ఔను. అదియేకారణము. మనముద్దుబాలకు బాల్యంబుననే వివాహముచేసిన బాగుండునని యువ్విళ్ళూరుచుంటిని. ఏతత్సంబంధమైన యూహించితిరా.

సుబ్బా—అందుకొరకు విశ్వప్రయత్నము చేయుచుంటిని.

సోమి—ఎందులకు? మనయట్టి పేదవాళ్ళపిల్లను యేశ్రీమంతుల కిత్తురు? వాళ్ళు జేసుకొందురా.

సుబ్బా—వెర్రిదానా! ప్రపంచజ్ఞానము లెఱుగని బేలవు. ఎందుకన,

గీ. కన్య వరునకు సౌందర్యగరిమగోరు
సత్తవిత్తంబుగోరు మాామధికవిద్యగోరు
బంధుజనంబు సత్కులముగోరు
పరజనముగోరు మృష్టాన్నభక్షణంబు.

అట్టి సర్వలక్షణసమన్వితుండుగావలయునని అందరూయూహింతురు. మన లెక్కయా కాని యికాలమున

సీ. విద్య నెక్కుడుయున్న వెలదిభాగ్యముసున్న
భాగ్యమున్నను విద్యపరిమఱుగును
విద్యభాగ్యంబున్న లెసగురూపుండగు
మూండుగలసియున్న మూాగడగును
సర్వలక్షణమున్న శాంతంబుకొఱతగు
శాంతమున్నాతడు సరసిగాడు
ఆరయసరసంబు ఆద్యంతముండిన
చీట్లాట వోనెప్పు జెలగుచుండు

గీ. అతివ యికాలమున ఘనమైనవాని
వెదకజాలము తుదకు నావిధముగాను
పెండ్లికొమరుండుదొరకిన ప్రీతితోడ
కట్నములనిచ్చి జేతునో కలికిమిన్న.

కావున నేనన్నట్లు వరుండుదొరకిన చేతను కానులేకున్నను మొట్టులో శ్రమించి కానుకలిత్తును. కన్యాదానఫలము జెందుటయేగాక నావంశము నాజన్మయు పవిత్రత జెందుట కేకొఱంతయునుండదు. అందులకే సకలబాంధవ్యములు తరచు చుంటి మాటలతోనగునా యెంతశ్రమపడవలయునో!

సోమి—నిజమే. నాకన్నముమ్మందుగా మీరే ఆలోచించుచుంటిరని నాకెట్లు తెలియును. యెన్నడైన జెప్పితిరా.

సుబ్బా—లేదు. యేదియు నిర్ధారణలేని దెందులకని.

సోమి—సరే స్నానము జేదురా వంటసిద్ధమైనది.

సుబ్బ—అ

రంగము

[వెంకటశాస్త్రి, సుందరశాస్త్రి ప్రవేశము.]

వెంక—మీరా పిల్లను చూచితిరా ?

సుంద—ఆ ! చూడకే.

వెంక—ఎట్లుండును ?

సుంద—ఎట్లుండునా! చక్కదనాలచుక్క. వెయ్యేల

గీ. ముఖముచందురుబురడించి; ముద్దుగుల్కు
కురులు నెలాలుబాహులు; కోమలములు
దొండ లధరము కుంభములుబోయి తోయజాక్షి
అనుచు జెప్పితిమునుగాదె యనఘమీకు.

అట్టి సర్వలక్షణ సమన్వితకాదనుట కావశించిక సహాతరము గాదు.

వెంక—సరే. మీవచనానుసారినైగ రావచ్చితిని. మీయిచ్చవచ్చిన తెరకగునగుదిర్చి మాసోమనాధునాబాలను సమకునార్చు భారముమీది.

సుంద—ఆ ! అట్లేజరుగగలదు.

వెంక—యింతగాజెప్పుట యెందుకన ఆపిల్ల రూపసియో కురూపసియో గుణవంతురాలగునో కాదోయని! ఏమందురా.

గీ. పెండ్లికొమరులజ్ఞాతికి ప్రీతినొసగు
కోడలై యున్న మేలనికులుకుచుంద్రు.
తమకు తెలియనివిషయమీ ధరణిగలదె
ఘనతకెక్కిన కోడలుగల్గియున్న.

కోడలు చెడుగైన కులముజెడును. కీర్తిదెచ్చినను అపకీర్తి తెచ్చినను కోడలుగదా వన్నెకెక్కించునది.

సుంద—ఔను. నేనాకన్యను జూచుట మీతో జెప్పుట తటస్థించినది. గాని లేకున్న మీకాపిల్ల దొరుకునా!

వెంక—సరే మాసోమనాధుడు అర్ధరు కన్యలను వివాహమాడుట సంతతి గల్గకుండుటయేడవవానినందులకుగదాయీప్రయత్నము

సుంద—ఔను. నిజమే కాదన్నదెవరు ?

శఖు—ఆహాహా ! యేమిటి అర్ధరను పెండ్లియాడుట సంతానము గల్గకుండుటయా! బలే ఏడవదానిని పెండ్లియాడుటకా యీ యార్భాటము! శారదా శాసనము జ్ఞాపకమున్నదా లేక వారల నందరతల యొకరికి కట్టిపెట్టి యేడవదానిని జేతురా

వెంక—నీ వెవరవయ్యా! పానకములో పుడకలాగున అపశబ్దములు పల్కుచుంటివి. మన బ్రాహ్మణజాతిలో మారుమనుము లేమిటంచు వంశము నిల్పుటకెన్ని పెండ్లిండ్లైనా జేయ వచ్చునుగా..

శఖు—ఆ! మనశాస్త్రములు ఇట్లున్నవి గాబోలు! పూర్వము తొమ్మిది సంవత్సరములుదాటితే వెలివేయ వలయునన్నారు.పిదప రజస్వలానంతర వివాహములంటిరి. మరికొన్నాళ్లకు విధవా వివాహములంటిరి.మనవాళ్ళు యిన్నికళకూళ్ళగంపగా యెన్నో యికనెన్నో స్మృతులు గల్పించి తక్కిడి బిక్కిడి జేయు చున్నారు.

వెంక—యింతకూ మీారనే దేమిటయ్యా?

శఖు—ఏమంచానా! ఆర్థురిని పెండ్లియాడియేడవదానికై అలోచించు వాలుడు ఎంత లేతవాడోయని.

సుంద—లేత ముదరేమిటయ్యా! డబ్బే లేత దెస్తుంది దరిద్రుడై తేను నీవన్న మాటలు.

వెంక—లక్ష్మికి ముదిరేమిటి? యదియే యౌవ్వనము దెస్తుంది! ఆలోచన లేని బ్రాహ్మడువలెయున్నావు

శఖు—ఆ నిజమే! నాకు ఆలోచన యెట్లుండును? మగడెవడైనా వస్తాడు డబ్బెలాగువస్తుంది? డబ్బున్న మగువలకు మగడులోటా? ఔను. కాలమహిమ హా,హా కలికాలము గదా యిది. ఏపిల్ల గొంతు కోయదల్చుకున్నారో పాపము!

సుంద—గొంతులుగోయుటకు కషాయ వాళ్ళనుకొన్నావటయా శుభమా యంటు పెండ్లి బేరములకు వస్తుంటే యీమాట లేమిటంచ.

శఖు—గొంతులు గోయుటకాదు. నరమాంసము గొనుటకు కాక పోతే లంచములు గొట్టి దరిద్రుల కొంపలు తీయుటకుకాదు కనకము యెరజూపి కాంతలగొనుటకు బాగుంది.

వెంక—బాగుంది మీావరస. పిలువని పేరంటమునకు వచ్చి మాకు నీతులు జెప్పుటకా యీరాద్ధాంత సిద్ధాంతములు.

శఖు—కాదు. ఆముదుసలి పెండ్లికొడుకుతో ఆపిల్లసుఖపడునా లేక చెట్టుపేరు జెప్పి కాయలమ్మునో నిదానించండి. ముసలివానికి పడుచు పెండ్లాము గతులట్టులేగా! ఓహూ పెద్దలు జేయు పను లిట్లేయుండును. ముసలివానికి పిల్లలు గల్గుటా! పిల్ల పెద్ద దెప్పుడగును? పిల్లలగను నెప్పుడు? పిల్ల పెద్దదగుసరికే ఆవరుడు జీవయాత్ర చాలించ సిద్ధముగా యుండునుగదా! కాదు. ధర్మ

సంతానమున కంటిరా మునుపటివాళ్ళే చాలును; విన్నారా! పెద్దలు గనుక దత్తత జేసుకొనమనండి నిదానించండి. నాపై కోపమేలను నిజముపల్కితిని.

సుంద—చాలుచాలు రావయ్యా వెంకటశాస్త్రి! యీతని మాటల కేమిలే ఇన్ని యాలోచించినకార్యములగునా? యేకో త్రోవ బడి పోవు చుంటిమి. గమ్యస్థానము చేరవలెను. చేరగలము డబ్బున్న కొండమీద కోతి దిగివస్తుంది. మంచి వరుసగానే యున్న వీతనిమాటలు (అని చనుచు) అదుగో, ఆ, అగుపడున దే వారి యిల్లు (అని యంజని తలుపు తట్టి) సుబ్బావధాని గారు, (లోపలనుండి) ఎవరువారు, మేము సుంద్రి కోనసీమండి

సుబ్బా—ఇదిగో తలుపు తీయవే. బంధువు లశ్లేయున్నారు.వచ్చేయీ కాటకపు రోజులలో!

సోమి—(తలుపుతీసి) మీర్గారా! ఎవరను కొంటిని. రండి. లోనకు ఏమండో, మాంఅన్నయ్యగారు వచ్చియున్నారు.

సుంద—బావగారు లోనయున్నారా?

సోమి—ఉన్నారు. స్నానముచేసి సంధ్య వార్చుకుంటున్నారు.తమ్ముడు చాలాకాలమునకు.

సుంద—అక్కా తీరిక లేదు.

సుబ్బా—రారా సుందరం జయచేయండి పిల్లాజెల్లా సుఖమా.

సుంద—ఆ, అంతా కులాసాగా యున్నాము.

సుబ్బా—వీ రెవరు?

సుంద—వీరా, సోమనాథామాత్యుని పిన తండ్రిగారు పెద్ద శ్రీమంతులు.

సుబ్బా—ఆలాగునా! తమనామ ధేయం.

వెంక—వెంకటశాస్త్రి అంటారండి,

సుబ్బా—మహానుభావులు. యిద్దరకువచ్చు కారణమెరుగవచ్చునా? ఉరికేరారు. మహాత్ములు.

వెంక—తమతో శుభముకొరకు మాట్లాడవచ్చితిమండి.

సుబ్బా—అలాగునా! ఈనిరుపేదవాని పవిత్రము చేయవచ్చితి రన్న మాట.

వెంక—ఎంతమాట సెలవిచ్చితిరి! మామనవి చెల్లింతురని గంపె డాసతో వచ్చితిమి.

సుబ్బా—ఎంతమాట సెలవిచ్చితిరి!

సుంద—బావగారు! వీరిఅన్నకుమారునకు మన మాచమ్మనుఇప్పింతు నని తీసుకొనివచ్చితిని.

సుబ్బా—అలాగునా! అతనిపేరు సోమనాధుడుగదూ?

సుంద—ఔనుబావా! ఔను. వారు మిక్కిలి శ్రీమంతులు.

సుబ్బా—వారికిదివరకు పెండ్లి అయినదిగదూ!

సుంద—అదా! ఎన్నిపెండ్లిళ్లు చేసుకొన్నను సంతతిగల్గునని వారి భ్రమ. అక్కా నీవెరుగవటే.

సోమి—ఎరుగకే. వారిపశువులు, గాదులు, బంగారము, ఆస్తి అబ్బో! అంతా ఎరుగుదును. పెద్దభాగ్యవంతులు. అతడు చక్కగాయుండునుగాని కొద్దిముదరని నాయూహ.

సుంద—పిల్లలు అలాగేయుందురా? పెద్దవాళ్ళుగాక ఏమంతపెద్ద. నాకన్న పాతికయేండ్లేగా! మనమాచమ్మమాత్రము ఇక నాలుగేండ్లుపోతే పెద్దదగుదటే. ఆలోచించు.

సుబ్బా—శ్రీమంతులు మనవంటి పేదవాళ్ళపిల్లను జేసుకొన్న దాసీలవలెజూతురు. బావా! అంతకుదగ్గబొంత యన్నట్లు చిన్నవాళ్ళు పెద్దవాళ్ళతో చేయరాదు. ఆలోచించు. మన తహతకు సరిపడువారికిచ్చుట నామతము. ఏమే! ఏమంటావ్,

సోమి—ఏమంచాను కోరివచ్చినప్పుడు తప్పక ఇచ్చేయుమంటాను. మనకు లేకపోయినా నాపిల్లసుఖపడుతుంది.

సుబ్బా—ఆలోచించి మాట్లాడుచుంటివా ?

సోమి—ఔను. ఆలోచించిమాట్లాడుచుంటిని. తప్పకచేయవలసినదే. మనకు లేకపోయినను పిల్లసుఖపడుతుంది.

సుబ్బా—నిదానించు. అర్ధరుప్పె పెండ్లి.

సోమి—అర్ధరుకానియ్యండి. ఏడుగురుకానియ్యండి. అన్నవస్త్రము లకు లోటుండదు. వారైశ్వర్యము మీరుచూడలేదుగాని, వందకుటుంబములు యిష్టమువచ్చినట్లుతిన్నను లోటులేదు. తప్పక జేయవలసినదే.

సుబ్బా—నీకేయింతపట్టుదలయున్న నాకేల ? కష్టసుఖములనుభ వించుదానవునీవు. నీకూతురికష్టసుఖములు నీకు తెలియదా ?

సోమి—ఆ. వారుమంచివారు. పేచీపూచీలేనిమనుష్యులు. అన్ని లక్షణములు బాగున్నవి. నామాటవినండి. చెడగొట్టకండి. లేత ముదురుతో పనిలేదు.

సుబ్బా—వెంకటశాస్త్రిగారూ! ఆలశ్యమెందులకు ? ముహూర్తము స్థిరపర్చి. తాంబూలములు పుచ్చుకోనండి. యిదిగో పంచాంగము.

వెంక—(యిటు అటు చూచి) ఈసంవత్సర శ్రావణపూర్ణిమకు బాగుంది.

సుబ్బా—సరే. ఆముహూర్తమునకు తమబంధుమిత్ర సపరివారముగా వచ్చి యీశుభము నిర్విఘ్నముగా నెరవేర్చుకొని వెళ్ళ గలందులకు నాకోరిక,

వెంక—చిత్తం. తమదయ పూర్ణముగాయున్నది. సెలవు (అని తాంబూలములు పుచ్చుకొని చని పెండ్లి అతివైభవముగా జేతురు.)

ఇతిరంగః

ప్రథమాంకము సమాప్తి.



# శ్రీ భీమేశ్వర మాహాత్మ్యము

## ద్వితీయాంకము

### ప్రథమ రంగము

[మాచమ్మ—చెల్లులతో]

**మాచ**—చెలీ, సరళా! చూచితివా! యీయుద్యానవన శృంగారము నేత్రోత్సవ మొసగుచున్నది. అటుచూడుము.

సీ. మురియుచు జనుదెంచు, వారలకనుకొని
కెరలి స్వాగతమిచ్చు, కీరచయము
త్రోవ నెరుగనట్టి అవని జనులజూచి.
దారిజూపించు మయూరవితతి
అతిథులే తేరగ అవనిగృహస్థుల
సిరిజూపించు మృగీగణంబు
కోరకోర్కెల నుదారతనొసగెడి
ఫలదానమిచ్చెడీ యలరు తరులు
గీ. గలిగియుద్యానవనమెంతో, కాంతితోడ
ఘుమఘుమల్ తావులెల్లెడ గ్రమ్ముచుండె
ధన్యులైతినియానంద గణ్యమైన
నీటికొలకులు యవిచూడు నీరజాక్షీ.

**సరళ**—ఆ! అందులకు సందియమేమి?

**మాచమ్మ**—అదేచూచితివా? యీవనశృంగారము తనివితీరకున్నది ఎంతజూచినను జూడవలయునని యున్నది.

మనో—మాచమ్మా! ఈఉద్యానవన మహాత్మ్యము అట్టిది. నీవలె బాల్యచాపల్యమువీడి యవ్వనోదయమయి పుష్ప వికసము గల్గినప్పుడు ఆనందముగాక మరేమియుండును?

మాచ—నానావిధ పుష్పవిసర భాసురంబగు నీలతామతల్లుల పల్లవ హస్తంబుల నాదరించు నాపున్నగవృక్షమును జూచితివా?

సరళ—ఔను. నీవలె నీలతామతల్లివరుని సమీపించు వధువోలె ముఖమావలకే త్రిప్పుచున్నది చూడుము:

మాచ—ఔనది నైజమేగదా!

సరళ—అదుగో పారుజాతపుష్పములు చిత్తజల్లుగా రాలి యున్నవి. అవియేరి మాలలుగా గ్రుచ్చుకొందము రండు.

మాచ—మీరు దండలుగా గ్రుచ్చుడు. నేనిచ్చటనే యాడుకొందును

[లేడిపిల్లను జంకనిడుకొని శఖముఖశాస్త్రి సరళనుజూచి పాడుచు ప్రవేశించును]

సరళ—అపోకిరీపాటలేమిటి; ఆడవాళ్లనుచూచి

శఖ—ఆడవాళ్లను చూచి కాకపోతే మగవాళ్లను చూచివస్తాయా పాటలు! కన్నెపిల్లను చూచిన కన్నులూరకుండునా! ఒళ్లు పులకరింపులు, నోటిచప్పరింపులు, మనస్సుఆశలు ఆత్మ కోర్కెలు, విడుత్తాయా? నాలేడిపిల్లనుచూచి పాడుకొంటున్నా! తప్పేమిటి ?

సరళ—తప్పులేదు నోటి భ్రమదీర్చుకొంటున్నావా! నేచేతిభ్రమ తీర్చుకొంటున్నా (అని కొట్టును)

శఖ—ఆదెబ్బలు పూలుబంతులైయున్నకొట్టు. ఆ! కొట్టు! అన్న మాటకు తిరుగుండరాదుకొట్టు. మన్మథయుద్ధముగామార్చి కొట్టు, మాటాడనుకొట్టు.

పాట

సరళ:—చాలులే సరసాలు చనువు చిక్కినమాటలా ||చా||
వీలులేదు బాపనయ్యా వెనుకమళ్ళిపోవయ్యా ||చా||
శేఖు:—పోతున్నా! పోతున్న! ప్రీతితో వచ్చియున్న ||పో||
జతగలసి పోతున్న సంతసింతు యేమన్న ||పో||
సరళ:-యిట్టి బండ మొండివాని యెందుచూడలేదయ్యా
మాటుగట్టి నన్నికను మళ్ళిపోనియ్యవా ||చా||
శేఖు:—మొండిబండ యనుచు నన్ను మోసగించ నెంచితివా
తిండి తిప్పలనకుండగ తెలియద నీయందునాకు ||పో||
సరళ:—మాటలందు నేర్పరివె మాయలాడపల్కబోకు
తీటతీరినవెనుక తీపులు యిక తగ్గునేమొ ||చా||
శేఖు:—:ఒట్టునీయందున నామట్టు బహుకోర్కె నిండెయిట్టు
చట్టునజని మాయింటికి చయ్యనపోదము రా రా ||పో||
సరళ:—అదుగో యెవరో వచ్చుచున్నారు పోదము పద.

యవనిక

[జోగన్నశర్మ : వెంకటసోమయాజి ప్రవేశము]

వెంక—ఏమండో జోగన్న శాస్త్రీ! విశేషాలేమిటి. ఈమధ్య గ్రామాంతరము వెళ్ళుటచే గ్రామవిశేషాలు తెలియలేదు.

జోగ—పాపమా పెండ్లికొమరునకు జబ్బుగాయున్నదని వదంతుగాయున్నది. నేనుజూచి వత్తమన్న వారికి మాకు మనస్పర్థలు గదూ! అందుకు వెళ్ళుట తటస్థించలేదు.

వెంక—ఆ! ఎంతమంచివాడండీ! ఆబ్రాహ్మణుడు.

జోగ—మంచివానికే మరణము. దరిద్రునకు దీర్ఘాయుష్యం. ఆధనము ఆపశువులు, ఆభూములు, అట్టి మంచివాడు మనబ్రాహ్మణ జాతిలో లేడుసుమా! జోగన్న శాస్త్రిగారూ!

వెంక—పాపము అనిత్యానిశరీరాన్ని అన్నట్లు, ఎవ్వరికేది వారి. తనువులే శాశ్వితము గానప్పుడు ఇవన్నియు శాశ్వితములా!

జోగ—అదికాదుగాని; అరువదిసంవత్సరములు వయస్సు, అర్హరు కన్యల వివాహము అనపత్యదోషమునకై యేడవదానిని యీ నెమరుగంత పిల్లనుచేయుట, పులికూతపుట్టయన్నట్లా తనికి జబ్బు ప్రవేసించుట, యట్టిదానికెట్టి యాపదతటస్థించినది కాని, సర్వమెరిగిన బ్రాహ్మణుడు, ఒక్కగా నొక్కపిల్ల, ఆపిల్లకిట్టి వివాహమా!

వెంక—ఔను. దరిద్రము ఎట్టిపనులయినను జేయించును. ఆపిల్లసుఖ పడుననియు ముదరవాళ్ళు మాత్రము కొంతకాలము బ్రతుక లేదా. అరువదియేండ్లగా భగవంతుడు రక్షిస్తే ఇంకను అరువ దేడులు వయస్సున్నదిగదూ.. ఇంతయూ పిల్ల యదృష్టము పూర్వకర్మమును. ఒక్కపర్యాయముచూచివత్తమురండి.

జోగ—మనము మాత్రమువెళ్ళి ఏమిచేయగలము? చూచి, విచారిం చుట తప్ప.

వెంక—రాతయ్యశాస్త్రి! రా! మంచివాడు సుబ్బావధానిగారు. రా.

[సుబ్బావధాని, సోమిదేవంబ]

సుబ్బా—అయ్యో!

సీ. లేకలేకనుగుంది లేమగల్గెనటన్న
సౌఖ్యమేమూలనో సన్నగిల్లె
కలిమిగల్గినయట్టికాంతుండు సుతకన్న
కడ తేరెనాతడు కన్నులెదుట
తోడునీడా నీకు తుదికాన్పుదానవు
యిరువురమొక్కటే ఏమిసేతు
కొంతకాలంబన్న సంతతసౌఖ్యంబు
వెలసినాయనుకొన్న విధవయయ్యె

సీ. వీధికూర్చుండి యీరీతి దెంపులేని
దుఃఖవార్ధిని ముంపఁగ దోచెనలువ
దైవమే యిట్టిరీతులఁదలచుచుండ
కాంత మనమేమిచేతుము కాలగతిని.

చెలీ ! యెంతలో యింతమూరినది. సతత మనురాగవీచికల నోలలాడుదురుగదాయనుకొన్న అడవిగాచిన వెన్నెల విధ మయ్యెను. యీ బాలబ్రతుకుకై యేమని నిందించుకొందును. యీ చిన్నిసువుతో మనముగూడ సుఖమనుభవించెదమను కొన్న అది వట్టిభ్రమయయ్యె. డబ్బునకాసించి అరువదియేండ్ల వానికిముడిపెట్టి నీబ్రతుకు గంగలో కలిపితిని. తల్లీ ! యిప్పు డేమనుకొన్నను నాదియేతప్పు. యీ తెలివితేటలు మునుపున్న యిట్లుజరుగకుండునుకదా ! కాంతా !

సోమి—నాధా ! నాధా ! యూరడిల్లుడు. మీకన్న నెక్కుడు దుఃఖమునాకుగలదు. ఏమిచేతుము. దైవమావిధముగా మన బాలనొసటవ్రాసియుండ మనమేమిచేయగలము ? ఆభార్యా భర్తల ముద్దుముచ్చటలు అందముగాచూచుటకు మనము నోచుకొనలేదు.

సుబ్బా—(విచారముగా) గతజలసేతుబంధనమని తెలియకగాదు. సర్వపారంగతుడు, శ్రీమంతుడు, గుణవంతుడు, సత్యసంధు డైనఅల్లుడుగతించె. యేమిచెప్పను. నామనోవిచారము. (మాచమ్మ తలిదండ్రులవద్దకువచ్చుటచూచి గొల్లుమందురు. ఆగోలవిని ఇంటిపొరుగువారు కొందరువచ్చి సుబ్బావధానిని, సోమిదేవంబను ఓదార్చుచు) ఊరుకొండమ్మా. ఊరుకొండి! చిన్నపిల్లవాడలిపోవుచున్నది.

సీత—ముండాబ్రహ్మ మూన్నాళ్ళుముచ్చటైనాచూడలేక పసిబాలను వైధవ్యముపాలుచేసినాడు, ఊరుకొండి, అమ్మాఊరుకొండి,

ఎంతవిచారించినా సముద్ది వచ్చినవాళ్ళు రారుగదా! అవ ధానిగారు! ఊరుకోండి.

పద్మ—పాపము. పాముదకు వెళ్ళినవాళ్ళువెళ్ళవలెనుగదా! ఎట్లు భరింతురో పాపము. తల్లిదండ్రులు.

లలిత—ఎట్లుభరింతురు యీ పిల్లనుపోగొట్టుకొనినపుడల్లా తప్పనేడప్పుడీ దుఃఖము.

[యిట్లు దుఃఖించుచుండ కొంతకాలమునకు మహాశివరాత్రి ద్రాక్షారామం భీమేశ్వరతీర్థమునకు పోవుటకు సుందరమ్మ తోటి చెల్లెల్లతో త్రోవనుజనుచు పాట]

మాచ—(తనలో) అదుగో ద్రాక్షారామము అదిగో సప్తగోదావరి. ఆహా! న్యాలయ శృంగార మేమని తెల్పుదును నేత్రోత్సవమొసగుచున్నది. నానాతరుగుల్మ లతాదులతో సొంపుగల్గి వింతనొసగు వృక్షసమూహమున గన ఆనందాంబుధి వాలలాడుచున్నది. వకుళనారికేళ కేతకీ పున్నాగరంభాద్యనేక బదరీ పనసఖర్జూరచూత సకలవిధ ఫలపుష్ప భాసురంబగు ఉద్యానవనశృంగారంబు సప్తగోదావరి నిర్మలసలిలపూర వాయుదెమ్మెరలు, ఆహ్లాదపులకితశరీరను జేయుచున్నది. ఆమందానందసంకలితంబై సంతోషాశ్రులు గారుచున్నవి. అదుగో యీజనసమూహముగన్న లెక్కకునెక్కుడై యెడ తెరిపిలేదుగదా! ఓహో! యీపురివైభవము

సీ. యేవంకగనుగొన్న నిందిరావాసమౌ
మోహనసౌధముల్ ముదమొసంగు
యేచాయవీక్షింప నాచాయనగుపించు
సతతభక్తజనంబు స్తుతిమతంబు

యేవీధిగనుగొన్న నాదిశయందమా
సలిలకాసార శ్రీ సమునయంబు
యేవీధిగనుగొన్న నావీధినంగళ్లు
నయనంబులకు చల్లనై యొసంగు

గీ. ఔర ఏమనిదెల్పుదు అమితమైన
దక్షపురివాటి దక్షుని దహనవాటి
వైరిహరమేటి కైలాసవరసుపేటి
ధన్యకరమేటి పుడమినిదక్షవాటి.

ఇట్టి నర్వవసమాంబగు భీమదేవునిమహాత్త్య మేమనవచ్చు
అనాధనాధుండగు ఆమహాత్మునిచర్య . . లేమనివినుతింతును.
అదుగో !

సీ. ఒకవంక బ్రాహ్మణుల్ జక్కనౌ వేదంబు
గాయకు లరికథల్ గలసిజెలగ
హరికీర్తనంబులు నందందు జేయుచు
శంభో శంకరయని జనులుపల్క
మాణిక్య దేవితో మన్మదాంతకుడంత
పల్లకిపై నెక్క పరిమళింతోడ
యూరేగుచుండగ యుర్విభూదేవులు
ప్రాబల్కు లానందపరిమ నెరుప

గీ. సంతసమునొందెజూడ నాస్వాంతమందు
యేమిజెప్పుదు నేనిట్టివై భవంబు
జూచియెరుగను గంటినిసోద్యమలర
క్రొక్కలీడేరె నామనఃకోర్కెలయ్యె.

"నేత్రోత్సవము, శ్రవణానందము, పాపభూత శరీఃఖండకృపా
ణోపేతము, ఆహ్లాదాశ్రుతపులకిత శరీరసంస్థాయమానఘా

ప్రదేశము. యీపురికాంత లెట్టివ్రతము లాచరించిరోగదా! అదుగో! శ్రీ భీమనాధునాలయగోపురాదులు. అల్లదే సప్త గోదావరితల్లి. యిక నాలయంబునకు జనెదగాక. అదుగో! ఆమధ్యనున్నదే భీమనాధమాణిక్యాంబల నివాసధామంబు. అదుగో స్త్రీజనములా విగ్రహమును కౌగలించుచుండిరి. నేనును అట్లాచరింతునుగాక. (అని చని కౌగలించుకొని) ఓ దేవా! నీవెవరవోగాని వీరలంద రేకోర్కెతో నిన్ను గోరి యిట్లాచరించిరో ఆకోర్కె నాకొనగూర్పుము. నీకిదే వందనములు. దీనపుణ్యముండునుగాబోలును. (అని గర్భాలయమునకుజని ఆశ్చర్యముతో భీమానాధ మాణిక్యాంబల చూచి)

ఉ. దక్షపురీనివాస సురధన్యమునీంద్రవిహారమాన సా
దక్షుడవీవెనాకికను దానవమర్ధన భీమనాయకా
కుక్షిని సర్వలోకములుగూరుచుకొన్న మహానుభావ నా
భిక్షనుదీర్పవేడెదను బ్రేమను పుత్రుకశోకంబాసంగుమా.

త్రిపుర దానవమర్ధనా! లోకపావన! దక్షపురీవిహారా మాణిక్యాంబామనోహరా! హరా! ఈదీనురాలి మొర లాలించి చక్కని చిరుతకొననిచ్చి నీభక్తపాలనబిరుదంబు నిలుపుకొమ్ము. నే నిదే జనుచుంటిని. నిన్నుకోరినకోర్కె లీడెర్చుమంటిని. సెలవు. (అని నమస్కరించి చనును.)

రంగము (సభాపతి బ్రాహ్మణ సభ)

సభాపతి—పండితులారా ఎట్టివిపరీతపువార్తలు వింటిమో. వింటిరా పూర్వము నుంచి శాఖోపశాఖలుగాయున్న మనసంఘము నేకజాతిగా ప్రజలు దలచునట్లు సంచరించిరి యిప్పుడు మనలో వింత వింత మాటలు వినవచ్చుచున్నవి. ఏలనన్న

మవలో మనకే ఒక్కొక్కరు ఒక్కొక్కమతముతో పార్టీ లతో సనాతనధర్మము మంటగల్పి గౌరవమైనమాజాతిలో బుట్టి గౌరవహీనులగుచున్నారు. స్నానసంధ్యలు మానుకొన్నారు దేవాలయములు పూజలు యెప్పుడు మానుకొన్నారో అప్పుడే మన మహాత్మ్య మంతరించినది. మనవిద్యలు మట్టిపాలై యితరులు మనవిద్యగ్రహించి మహనీయులగుచున్నారు. మనమో మానవజాతిలో ఉభయభ్రష్టు లగుచుంటిమి. ఈమాటలకేమి గాని చెప్పమరచితిని మన సుబ్బావధానిగారు పండితులై యుండి విధవయైన కుమార్తెకుగర్భ ముగల్గ యూరువారందరు గొల్లున జెప్పుకొనుచుండ, తనకు తెలిసియు తెలియనట్లు నటించుచున్నాడు. చేను కంచెమేస్తే కాచేవాడెవడన్నట్లు మహాపండితులై యుండి ఇట్లుచేయుట సబబుగాలేదు కనుక సనాతన ధర్మము మంటగల్పలేక ధర్మము నిలిపి అంతుజేయుటా? సభాసదులాలోచించి నిర్ణయించు భారముమీాది సభనుప్రోవుచేయుట ఆక్షేపత్రముపంపుట నావంతు. యేమని యెదరు.

అందరు—తప్పన్నవాని దండించకున్న మితిమీారును.

1 ప్రజ—ఆర్యావర్తము కర్మభూమి'

2 ప్రజ—అందులకే యిట్టి అవధానులు గల్గి అనాచారభూమిగా చేయుచుండిన కళింగరాష్ట్రములలో యిట్టి అనాచారములుండ రాదు.

4 ప్రజ—ఆర్యావర్తనమున ఆర్యులమగుంటిరి.

5 ప్రజ—లేదు. కళింగమహారాజు కర్మభూమిని కాపాడుచుండిరి.

అంతయేల, సుబ్బావధానికి కబురుపంపి కారణమరచుకొండి.

సభాపతి—వీరన్నశాస్త్రి! నీవువెళ్ళి సుబ్బావధానిని తీసుకొనిరండి (అనిపలుకగా)

శఖ—(ప్రవే) కండ్లు సికిలించుకొంటూ (యిటునటుచూచి) ఈపెద్ద లందరు ఆశీనులై నారెందుకు? యెవరి కొంపను కూలదీయు టాని కీయాలోచన.

సభాపతి—రా! రావయ్యా శాస్త్రి! కూర్చో.

శఖ—ఆ. కూర్చున్నాను. నాకొకరి మర్యాదతో నిమిత్తములేకుం డానే, నేనే వెళ్ళదలచుకొన్నచోట్లకు వెళ్లుట, ఆనందించుట. సరే ఏమిటీ సమాచారము?

సభాపతి—యేమిటా! యేమున్నది? విధవలు గర్భము ధరించు చున్నారు.

శఖ—ఆ! ఎట్లు విధవలు గర్భముధరించినారూ! మగవాడు లేకుండ గనే! నేను నమ్మను.

సభా—నిజము. అందులకే యీసభ.

శఖ—యీసభ దాని నేమిచేయును? పైకి మంచిమాటలు చెప్పు టయేకాని కోర్కె గల్గునప్పుడు అందరు ఆపనికి సిద్ధమేగా? తెలియక చేసినదేమో!

సభా—తెలియక జేస్తే తెలిసి అనుభవించమను. ఎవరి కీదయ?

శఖ—కడుపుతో అనుభవిస్తునే యుంది. నీ కెందులకీ రాద్ధాంతము. జ్ఞానాజ్ఞానము లెరుగక చేసిన తప్పు తలిదండ్రులకేగా, చిన్న తనమున పెండ్లిండ్లుచేసిన తప్పు మాతాపితృలది. పిల్లదిగాదు. పోనీ ద్వితీయ వివాహము చేయరాదూ?

సభా—సరిసరి. ద్వితీయ వివాహములు శాస్త్రసమ్మతములా? వికట కవికే చెల్లునయ్యా? నీమాటలు నీవును.

శఖ—శాస్త్రసమ్మతములు కాకున్న బాల్యవివాహములు యిట్టి అనర్థకముల కాకరములు కావటయ్యా, సభాపతిగారు!

సీ. బాల్యవివాహముల్ బహుసమ్మతంబన్న
వారకేదుఃఖముల్ వడిరిగాదె
విధవ గర్భముదాల్చి వెలియందురే కాని
తనయింటగల్గిన, తప్పుగనరు
ముండమోసిన యట్టి, ముదితె యందురు గాని
తలిదండ్రులదుఃఖ, తమము గనరు
అతివయాత్మను కోర్కె, లడచి కుందియుగుండ
అగచాట్లు గొట్టి, ఆడించువారె
గీ. కలరు మనదేశమున ప్రజల్, కరుణమాని
స్మృతులు గల్పించి, యేవేవొ మార్పుజేయ
తెలియజాలరు తెలిసిన, యిట్టిఘనులు
చిన్నతనమున పెండ్లిండ్లు చేతురొక్కొ.

బాల్యావివాహములు ఎందరెందరి తలిదండ్రుల దుఃఖసముద్రమున ముంపలేదు ? యెందరు ప్రాణత్యాగము చేయలేదు ? యెందరు పరగ్రామములకు పరుగెత్తలేదు ? సృష్టి నిరోధించుటకు ఎన్నిగర్భములు హత్యచేయలేదు, సభాపతిగారూ !

ఉ. బాలల గోల మీకేటుల బాధలు గల్గునుమీకు నక్కటా
చాలును చాలు శాస్త్రములు సందడిజేసియు నాంతుజేతురా
మేలు భళా యిదెన్నటికి మీకు సమాజనఖంబులేద హా
కాలముజూచి శాస్త్రములు గావగ సంస్కరణంబు జేయరే.

బాల్యావివాహశాస్త్రములగూర్చి రజస్వలానంతర వివాహములకు దారిజూపి సంస్కరించండి. ఒకేశాస్త్రము ఒకే స్మృతి ఒకేకాలమునకు చెల్లునుగాని కాలమార్పునకు చెల్లదు. వివాహముగాకను విధవయైనప్పుడును గర్భమును దాల్చిరి. వెలివేతురన్న పూర్వశాస్త్రములలోనే,

సీ. మహనీయుడైన యా మస పరాశరుపట్టి
మత్స్యగంధిని గూడ మహిమ చెడెనె
కుంతిభోజునిపట్టి కోరి భాస్కరుగూడ
కుంతి కేకొదువయు గూడదయ్యె
విధవయైనట్టి ఇలపాండుభూపుని
తల్లి కేకొరతలు దాపురించె
బాల్యంబునను గర్భ భారమూనియు గన్న
అలకబీరుని తల్లి కేఘనతవోయె

గీ. లేదు లేదయ్య దోషంబు వాదమేల
స్వార్థపరులెల్ల పూర్తిగా స్వార్థమూని
జేసియుండిరి స్మృతులంచు చేతగాని
వాదములు సల్పి యిట్టులే వరలిరయ్యా.

సభా—ఔను నీవన్నది సూక్ష్మముగా జూచిన నిజమేగాని యుక్త వయస్సున వివాహముచేయ పూర్ణజ్ఞానము తెలిసిన బాల్య స్వాతంత్ర్యత వహించి అన్యకులజుని వరించిన యింతకన్న రసాభాసమగునేమొ. పూర్వులు యెన్నోకట్టుబాట్లకులోనై యుండిరి. యిప్పుడన్నో స్త్రీకట్టుబాట్లు లేవుగదా!

శకు—కాదుకాదు. పూర్ణజ్ఞానము. తెలిసిన బాల అనురూపపురుషుని వరించి కొంతకాలమైనను సుఖమనుభవించును. పెరయిండ్లకే జనుట కంగీకరించనిబాల పెండ్లికంగీకరించునా? అది మీఅప భ్రమ సుమండీ (విధవావివాహంబు విహితంబుగాదన్న ముండ మూలికి తప్పుమోపరాదు) అంటిరా సభాపతిగారు ఆలోచించండి.

సభా—నీకు నమస్కారము. నిన్ను ధర్మసందేహ మడగలేదు. పిలువని పేరంటమునకు వచ్చి మాలోమాకు పేచీలు ప్రవేశపిం

తువా? సనాతనధర్మము మంటగల్ప బ్రాహ్మణజాతిలో యెట్లు బుట్టితివయ్యా? రహస్యముగాయున్న శాస్త్రములు వెల్లడించి మనజాతి రహస్యములు వెల్లడించ మానుకొనుము. యిప్పటికే మనజాతిని చులకనజేసి అణగద్రొక్కుచున్నారు. ఊరుకొమ్ము. సుబ్బావధానిగారు వచ్చుచున్నాడు.

శఖు—మీకర్మము జెప్పదలచిన సంగతులు చెప్పితిని. నిజమాడిన నిష్ఠురము గల్గును. ముందు యీఅంటాపరులే అవస్థలను భవించి కడకు కన్నులు తేలవేతురు. యీదుష్టసంఘములో నాయట్టివాడు మాట్లాడుటతప్పు. సరే నేనిక్కడ యున్న యేదో యొకటి అనుటగల్గునుగాన నేనిందుండరాదు. (అని లేచిపోవును.

సభా—రండి. సుబ్బావధానిగారు దయచేయుండి. (అని కూర్చున్న తదుపరి) ఏమండి అవధానిగారు సర్వముదెలిసిన వారలు మీరలే రహస్యములు కప్పివుచ్చిన లోకమేమనునో, సంఘమేమనునో గ్రహించితిరా.

సుబ్బా—ఏమనును? తప్పుగలవానిని నిందించకమానునా. హేళన చేయక మానునా? నాగ్రహచారము కళంకములేని నావంశమునకు ఇప్పుడు కళంకమురావలసి యున్నదని విచారించుచుంటిని. ఏమిజెప్పను సభాపతిగారు నాకర్మ.

సభా—ఏమని జెప్పుదునందురేల మీరలు చెప్పకున్న యికనెవ్వరు జెప్పుదురు?

1 ప్రజ—గర్భము గల్గించినవాడు జెప్పవలయునుగాబోలు! కర్మమట కర్మము!

2 ప్రజ—కాదు. యీసమస్యకు సర్వశాస్త్ర సమన్వితులు కావలయునేమొ! నిదర్శనముగా యున్నదే!

3 ప్రజ—అతిగారాబముగా చిన్నతనమునుంచి నెత్తినెక్కించుకొన్న మహోత్సవమిది.

4 ప్రజ—ఔను. బాలరండలు స్త్రీయాత్రలకు స్వేచ్ఛందముగా తిరుగనిచ్చిన ప్రారబ్ధమిది.

5 ప్రజ—ఔను. మొక్కపువ్వాడు వంచకున్న మానినప్పుడువంగునా? తప్పు తండ్రిదిగాని పిల్లదిగాదు.

6 ప్రజ—మనమాటల కేమిగాని వాని అభిప్రాయము తెలుసుకొనరాదా?

సభా—అవధానిగారు యేమనియెదరు?

సుబ్బా—అనుట కేమున్నది? ఒక్కగానొక్క పిల్ల. ఆపిల్లనువిడచి యుండజాలను. పౌరషామేమె యని తర్జన భర్జన జేసితిని. యెన్నివిధముల .. బాధించినను నేనేమియు నెరుగను. ఆభీమేశ్వర దర్శనముచేసితిని. అంతకుమించి పరపురుషమెుగమైనను చూచి యెరుగనని పల్కినది. శివరాత్రికి వెళ్ళివచ్చిన కొన్నికాలమునకు భీమేశ్వరుడు నాతనయకు స్వప్నమున సాక్షాత్కరించి నీకొక కుమారుడు గల్గునని బల్కెనట. యింతకు మించి అన్యమెరుగనని పల్కుచున్నది. అదియుగాక నాకూతురుయొక్క మనస్సు నాకు దెలియును. యింతకు మించి చెప్పజాలను. తమచిత్తము.

సభా—హా! హా! మీరలు పల్కుపల్కులు బహుచమత్కారములుగా యున్నవి. భీమేశ్వరుడు వరమిచ్చెనా? నీకూతురు జెప్పెనా? మీరు నమ్మితిరా? వెర్రిబ్రాహ్మణుడా! మహామహులకే దర్శనమియ్యని ఆమహానుభావుడు దర్శనమిచ్చెనా? స్త్రీలమాటలు నమ్మితివా? స్త్రీలెంతకైనా తగుదురు. నమ్మింతురు; నమ్మించగలరు. దానికేమి ఆపిల్లను విడుతురా లేక వెలివేయమందురా చెప్పండి?

1 ప్రజ—యెద్దునడిగి గంతలుగట్టుదురా సభాపతిగారు !

సభా—నిజమే. ఎవరైనను నిదానించుట మంచిదిగదూ !

2 ప్రజ—నిదానింపులే యింతవరకు వచ్చుటకారణము.

సభా—ఏమందురు ?

సుబ్బా—ఏమనుటకేమున్నది ? పెద్దలు, శాస్త్రజ్ఞులు ఆలోచించవలెనని ప్రార్థన.

సభా—సభాసదులారా ! యెన్నిజెప్పినను యీ బ్రాహ్మణుడువినునట్లులేదు. కాన యిదిమొదలు యీ కుటుంబము నాంక్షలో యుంచితిని. అగ్ని నీరు మొదలగు నెవ్వియు వీరికుటుంబమునకివ్వరాదు. మాట్లాడరాదు. అట్లుజేసినవారు శిక్షింపబడుదురు. సరేనడవండి. సుబ్బావధానిగారు ఏమిచేతుము. (అని సభచాలించి యెవరితోవారు వారుబోవుదురు.)

రంగము—సుబ్బాధాని యిల్లు.

సుబ్బా—ఒంటరినై బ్రతుకుమని భగవంతుడు నా నుదుటవ్రాసియుండ అన్యథా యెట్లుజరుగును !

సీ. లేక లేకను గుంది లేమగల్గెనటన్న
సంతోషమెల్లను సన్నగిల్లె
కలిమిగల్గినయట్టి నల్లుండుగలడన
కడతేరె నాతడు కనులయెదుట
విధవయైయింటను ముదితయున్నదటన్న
సధవలక్షణములు సాటియయ్యె
గర్భప్రేమనుబట్టి గాపాడియుంచిన
యాడువారలు మమ్ము వేరుజేసె

గీ. సాటివారల పోటుల జావ వలసె
మేటిపండితకోటిలో మేటిగాంచి
కూతుమూలంబునను యెంతొ కుములుమంచు
వ్రాసితే నాదునొసటను వారిజాక్ష.

సాటివారిపోటుమాటలకు తలయొగ్గ గర్భప్రేమచే యిట్లు మన వలసివచ్చెను. సరియే మాకన్న నాయన్నవారు లేరు. యీశ్వ రాజ్ఞ యెట్లోయట్లు జరుకక మానదు. యేమిచేతును.

మంత్ర—బాబుగారు! అమ్మగోరు రమ్మన్నారండి. మాచమ్మగారికి మగపిల్లోడుట్టినాడు. నీళ్ళోసి బొబ్బెపెట్టినాను. అమ్మగారు చెప్పిరమ్మన్నారండి బాబయ్యా.

సుబ్బా—ఆ! వస్తాయున్నా. (అని పంచాంగముచూచిగంతులు వేయుచు) నేటికి నాజన్మ తరించినది. ఆ భీమేశ్వరుడే యితడుకాకున్న యీ గ్రహసంపత్తి యుండదు. (నిదానించి) ఆస్వామిబిడ్డనకు ఆపేరేయుంచెదగాక) యని లేచి వెళ్ళబోవ తెరలెగయ ఊయాలలోయున్న ఆబిడ్డనుచూచి ఆనందము పట్టజాలక) భీమన్నా! నావరాలగున్నా! చిన్నభీమన్నా (అని ముద్దుపెట్టు కొని కుదుండబెట్టును.)

[దాదులు, తల్లిమాచమ్మ-ఊయల ఊపుచూపాట]

ప॥ జోముద్దుభీమన్న! జోముద్దుబాల ॥జో॥
అ॥ప॥ జోజో వరాల్గున్న! జోచిన్నియన్నా ॥జో॥
1. నాతండ్రి నాయన్న నిదురబోవేరా నన్ను పోషింపగా
నీవె దిక్కన్నా ॥జో॥

2. యెన్నో బాధలుపడి నినుగంటిరన్నా, నిన్ను కారణముగా వెలియంటిరయ్యా ॥జో॥

3. కష్టముల్ కడతేరె కంటినినుజూచి, యిష్టదైవములార యేలుడీ యితనీ ॥జో॥

నాముద్దులయ్య నిదురించుచున్నాడు. పోదమురండు.

రత్నా—యీతడు వరబలయుతుడల్లె తోచుచున్నది. కానున్న కొమ్మ రావలో యిత్తడి ముంతలు బుట్టునా? ముద్దులమూటలాగున్నా

. డీబాలుడు. రండు. లేచిన మారాముబెట్టును.

ఇది ద్వితీయాంకము సమాప్తి.



# శ్రీ భీమేశ్వర మహాత్మ్యము

## తృతీయాంకము

### ప్రథమరంగము

[బాలుడు భీమన్న పిల్లలతో ఆడుచు]

పాట

పల్లవి॥ ఆడుదమ్మా మనమందరుకలిసి పాడుదమా ॥ఆడు॥

అనుపల్లవి॥ వాడువీడు మరినేను జతలగాఆడుదమా పాడుదమా
జోడుకలిసి ఝాలాగున గోళీలాడుదమా ॥ఆడు॥

1. బాలులారరండీ అందరు బహుమంచిఆటలండీ
వాదులాడకను వరసవారిగా ॥ఆడు॥

భీమన్న—బాలులారా! మనమందరముకలసి గోళీలాడుకొందమా.

1 బాలు—ఆ! ఆడుకొందము లేవండిరా.

2 బాలు—ఒరే! మన గోళీలుదొబ్బుటకు వీడు యెత్తు పన్నుతున్నాడురా.

3 బాలు—ఎందుకుదొబ్బుతాడు? అన్యాయముగాఆడితే మనమంతేగా!

4 బాలు—సరే! బిరిలో ఎన్నికాయలురా ఉంచుట.

5 బాలు—రెండేసికాయలుచాలురా.

1 బాలు—అట్లైన ఆడుకొందమురండిరా.

2 బాలు—కుంటుచుపెట్టండి. రా యివిగో నాకాయలు.

భీమన్న—బచ్చాకు ఎన్నికాయలు చెప్పండి. ముందుఆటఎవరిది?

అందరు—నాది నాది. (అని అందురు.)

భీమన్న—అట్లుకాదు. చప్పటులేసుకొని యెవరుపండితే వారిదే ముందాట.

అందరు—ఔను. ఔను. (చప్పట్లువేసుకొన భీమన్న పండును.)

భీమన్న—యిదిగో ఆడుచుంటిని చూడండిరా (అని ఆటఆడుచు) ఒకటి రెండు మూడు నాలుగు అయిదు మీకాయలు అయినవి మరలపెట్టెదరా ?

2-4 బాలు—అన్నిదెబ్బలుతగిలినవిగాని ఆఖరుదెబ్బ తగులలేదు పిక్కులాడుచున్నావు.

భీమన్న—తగులకేమి దూసుకొన్నది. గిరిలోనుంచి యీవల బడినదా లేదా ?

1 బాలు—అదుగో మావోడుచెప్పేడులే ముందుగా పిక్కులాడుతాడు రావీడని

2 బాలు—ఆటసరిగా పెట్టు. లేకపోతే చూచుకో.

భీమన్న—ఏమిచేస్తావురా ?

4 బాలు—పిక్కులాడేవు గనుక తన్నుతాం.

భీమన్న—ఏదీతన్ను చూస్తాను.

3-4—(కలియబడుదురు) యింతవరకూ వచ్చినావు వెధవా.

భీమన్న—ఊరుకొన్న కొలది మిత్రిమీరు చున్నారు. ఎగరెక్కి కలియ బడుదురా వెధవల్లారా (అని మొత్తగాసదించును)

3-4 బాలు—అమ్మబాబో చంపేడురో ఉండు వెధవా మాబా బుతో చెప్పి ఏమిచేయిస్తానో చూడు మాకాయలుపుచ్చుకొని కొడ్తావా ?

భీమన్న—మాటలు సరిగా రానియ్యండి యేమిచేస్తానో.

1-2 బాలు—ఏమిసేస్తావురా ? అబ్బమాలిన ముండాకొడక.

భీమన్న—అబ్బమూలిన ముండాకొడకా! వెధవా! (కొట్టబోవ)

పెద్ద—ఆ! ఆ! ఆగరా! భీమన్నా! యేమిటీపేచీలు?

భీమన్న—గోళీలాడుకొన్నాము. నేనుగెలిచుకొన్నాను. ఉక్కురో సముకొద్దీ తిట్టుచు కొట్ట వస్తున్నారు. నేను తన్నేను అంతే.

2 పెద్ద—సరే మంచిపనిచేసేవు. వాళ్ళకాయలు వాళ్ళకిచ్చెయ్యరా.

1 బా—ఎప్పుడాడినా వీడితోయింతే.

3-4 బా—పిక్కిలాడి సూకాయలుచ్చుకొన్నాడు. చూడుమరి.

భీమన్న—పిక్కిలాడలేదునేను. గెల్చుకొన్నాను న్యాయముగాఆడేను.

2 బా—అన్నీ పచ్చిఅబద్దాలు.

3 బా—పేచీకి పెదబాబు.

1 బా—ఎప్పుడాడినా వీడితోయింతే.

భీమన్న—ఎప్పుడు మీరు నాతోఆడేరు? ఎప్పుడబద్దమాడలేదు. ఆడను.

3 బా—నిజమే మాదగ్గరా నీసంగతి.

1 పెద్ద—ఊరుకోండి. భీమన్నా వాళ్ళకాయలిచ్చే.

భీమన్న—ఇవ్వను. గెల్చుకొన్నాను. ఇవ్వనన్నాగా.

2 పెద్ద—వాడిస్తాడటరా వాడికున్నా తెలివితేటలు మనకొస్తాయా మనకే సమాధానము చెప్పుచున్నాడు ఎవరికి పుట్టినవి త్తనం.

1 పెద్ద—ఔను నీవన్నట్లు జ్ఞాపకమొచ్చింది. నానాజాతులోళ్ళకు పుట్టినవాడికున్న తెలివితేటలు అయినింట బుట్టినవాళ్ళకుంటా యూ నిజమే.

2 పెద్ద—ఏమనుకున్నావుమరి అబ్బమూలిన ముండాకొడుకులకు ఆలోచన లెక్కువని చెప్పుతారు. ఏలాగమాట్లాడుచున్నాడో చూడరావీడు.

1 పెద్ద—పోండ్రా వీడితోమీకు ఆటలేమిటి పోండి. (అని వల్లలందరు జనెదరు)

భీమన్న—(ఖిన్నుడై విచారించుచు) నాకు అబ్బలేదు. అబ్బలేకుండా పుట్టితిననుచున్నారే! ఎట్లుపుట్టితిని. వాళ్ళకు అబ్బయున్నట్లు చూచుచున్నాను. నిజమే! నాకునాయబ్బ అగుపడడే! కారణము తెలియదు. ఉన్నకనుపించడా! అందరూ యెప్పటినుండియో అంటుంటే యేమిటోఅనుకొన్నాను. యిప్పుడు వీరన్నమాటలుచూడ, ఎవరెవరికో పుట్టినట్లు మాట్లాడుచున్నారు. యెవడైనా యింతమందికి పుడతారా! యెవరికో యొకరు భార్యాభర్తగాయుండినపు పుట్టెదరుగాని యింత అన్యాయముంటుందా. యేమో! మాయమ్మరంభా! రంభాపుత్రుడనానేను! కాకున్న, యిన్నినాళ్ళనుండి యిందరిన్ని విధముల అనుచుండ మావాళ్ళేందుకూరుకుంటారు! వాళ్ళనేమైనాఅంటే వాళ్ళబ్బ యూరకొంటాడా? ఊరుకొన్నాడా? నిజమే. యింటికిజని యీసంగతి మాయమ్మనడుగుతా. సరిగా చెప్పకున్న యీరాయితో బుర్రరామకీర్తన పాడిస్తా. ఛీ! యిట్టిబ్రతుకు బ్రతుకుటకంటే చచ్చినను మంచిదే. (అని చనును)

సూచమ్మ వంటచేయుచు

(రంగం) పాట.

వల్లవి. శివునానతి యెటులున్నదో చూడగ – చిత్తమయముజగతీ॥శి॥

అను. భవుడీజగమున బహువిధగతులచె – పాలించిమించెనహాహా॥శి॥

1. దుఃఖమయముతో తూలన్ జేయగ – సుఖసంతసములుగల్గునట్టుగా

సోమనాథుడేగద సర్వముధర ॥శి॥

మాచ—కాలముయెన్నివిధములుగా మార్పుజెందుచున్నది. ఆపరమేశ్వరుడెన్ని చిత్రిగతులు గల్పించుచున్నాడు. కానున్న

స్త్రీ పుంనపుంసకములు గల్పించి వారచే వారలచే జగన్నా టకమాడించి చాటుననుండి చూచుచుంటివా? మహాత్మా! నీమాయలు అజహరులకే తెలియరాదు. దేవా! మమ్ములె వెలివేయించితివి. పదుగురతో ఛీ ఛీ యనిపించి దిక్కుమాలిన బ్రతుకు బ్రతుకమంటివా! ప్రభూ.

ఉ. న్యాయమ! నీకు యీవిధము నారదవందిత సీమపేక్ష నే
బాయని గాధలన్ బడిగ భావ్యమె భక్తజనానురాగమే
ఛాయను జేరి మ్రొక్కితిని జాలము దేల భవత్కృపారసం
బోయనగా యొసంగినను పూర్ణ కృపారతి నేలరాదహో.

మహాత్మా నీవు మాయందు దయచూపుచుంటివి గాని మాక ర్మమునకు నీకేమి చేయుదువు అదుగో నా చిట్టితండ్రి యింకనూ రాలేదు. ఎప్పుడు చూచిననూ ఆటలేగదా. తిండియనడు, తిప్ప లనడు. ఆగమ్మకాకివలె తిరుగుచున్నాడు. చదువులేదు సాము లేదు. ఉదయమైనది మొదలు సాయంకాలమువరకు ఆటలే గదా భయములేదు మొండిబండగా తయారగుచున్నాడు. ఆదలించువారైన లేకున్నారు. మాతండ్రిగారైనభయభక్తులు చెప్పుదురన్న అతిగారాబముచే యేమియు మందలించరు. వరప్రసాదిగదా యనుకొన్న శుభలక్షణములు కలికమున కైన గానరాకున్నవి. భవిష్యత్కాలమున వీడెట్లు బ్రతుకునో దెలియదు. (అంత తలుపుతట్టి) అమ్మా! అమ్మా! తలుపు తీయవే. ఆ వస్తున్నా. నాయనా వస్తూయున్నా. యింతవేళ వరకు యేమిచేయుచుంటివి. భయము చెప్పువారులేక ఇంత యాగడముగా తిరుగుచుంటివి. (అని తలుపునేసి భయాశ్చర్య ములతో యాతని ముఖమై ఖరిచూచి) నాచిట్టి తండ్రీ! యీ బండ యెందులకు?

భీమ—యెందులకా నీచే నిజము చెప్పించుటకు.

మాంచ—(భయాశ్చర్యముతో) నిజము చెప్పవలెను. నేనేమి జేసితిని తండ్రీ.

భీమ—యేమిచేసితివా యెరుగనట్లు మాట్లాడుచుంటివి. నాతండ్రి యేడీ.

మాంచ—(కన్నులనీరు నించుచు) నాయనా.

భీమ—ఏడ్చెదవేమమ్మా. నిజము చెప్పుము. చెప్పెదవా లేదా.

మాంచ—నాయనా నాకు చిన్నతనమున పెండ్లి జేసిరి.

భీమ—సరే తరువాత

మాంచ—తరువాత ఆయన కాలముచేసెను.

భీమ—కాలము చేసినతరువాత నేను బుట్టితినా.

మాంచ—ఔను.

భీమ—ఔనా రండా! నా తండ్రి గతించ నేను పుట్టితినా. యూరు వారందరూ అనుకొనట్లు నిజముగా గంటివా. వారిమాటలు నిజముచేసితివా? శంకర చీ నిన్ను గొరతవేసినను పాపము లేదు. తులువా యిట్టి తుచ్ఛపుబ్రతుకుకన్న చావిలేకపోతివా ప్రజలలో యెట్లు సంచరించితివే కులటా! నేమ్మా! కొడుకును గంటినని తలయెత్తి యెట్లు తిరుగుచున్నావే రాక్షసీ. పుట్టిన వెంటనే నన్ను దేనితోనైనను చంపకపోతివా తిరుగుమోతా. నాకేబాధ లేకుండునుగదా అని నీతిపరులా యిక నీకు చావు దప్పదు నిన్నుచంపి వేజచ్చెద అప్పటితో గాని నీనా అప ఖ్యాతి అంతరించదు (అని బండనెత్తి నెత్తిపగులగొట్టబోవ.)

మాంశ—(భయము నభినయించుచు) తండ్రీ! తొందర పడెదవేల? నీ జెప్పునది అత్యంతమువిని అప్పుడు నీయిచ్ఛవచ్చిన తెరగున ఆచరింపుము. నాకేభయములేదు. నీవేదిక్కని నమ్మిన నీ చేతులలో చచ్చిన యింతకన్న ఘనమున్న దాతండ్రీ!

భీమన్న—యింకనూ నీవు చెప్పవలసినమాట లున్నవా! చెప్పుము. జెప్పుము. చెప్పుట కేమున్నది ? విధవవై నన్నుగంటివి చెప్పుము; అంతియేనా ?

మాచ—కాదు. అట్లు నాభర్త ఆర్యుని పెండ్లాడి సంతతిలేక నేడవ దానిగా నన్ను పెండ్లియాడి సంతతిగల్గక పరమశివుని పూజించ నీతదనంతరము వంశము నిల్చునని చెప్పినట. అంతట కొలది కాలమునకు ఆయన మరణించ జ్ఞానాజ్ఞానము లెరుగని నేను మహాశివరాత్రికి వేడుకలుజూడ ద్రాక్షారామమునకు జని ఆ పరమేశ్వరుడగు భీమనాథుని నీయంతకొడుకు నిమ్మనికోరితిని అతనిదయచేతను,

సీ. దాక్షాయణీనాథు దర్శనంబునగన్న
తన్మయత్వొందె దనయునాకు
చూచియానందించి చోద్యముల్ పరికించి
చింతలేశములేక సంతసించి
పడతులు పార్థించు పాటుజూచియునేను
కోరితినట్టులే కోర్కెతోను
యేమిజెప్పుదుతండ్రి యింటికిజనుదెంచి
• • నొకనాడు నిద్రతో నుంటినయ్య

గీ. అట్టిసమయంబునను కలగంటినయ్య
కలలునిజమాయె నమ్ముమో కన్నతండ్రి
భీమనాథుండు ననుగని ప్రేమతోడ
బాల ! గల్గును కొడుకని బల్కెనయ్య.

ఆపరమశివుని దర్శనము ఆస్వప్నవృత్తాంతము దలచుకొన్న యిప్పటికిగూడ మరపునకు రాకున్నది.

ఉ. యింతననేల సూర్యశశి మింటనుతారలు వాయువగ్నులన్
సంతసమొప్ప సాక్షులిల చాటెదవో యిలివట్టిసర్వమున్
వంతరవంతలేకవిను వాసవుతోడ నివాస జేసెదన్
యింతకుదప్ప నేనితర మేమి యెరుంగనుతండ్రి నమ్ముమా.

కనుక నానుడు లాలకించుము నమ్ముము. ముమ్మాటికి నిజము. నిజము యిక నిజుష్టము.

భీమన్న—ఓహో ఎంతచనుత్కారముగా మాట్లాడితివే! భీమేశ్వరుడు నీతో మాట్లాడి నీకు వరమిచ్చెనా! చాలుచాలు ఊరు. కొమ్ము. పదుగురు నవ్వెదరు. ఎంతమాయలాడివే! చాలు చాలు.

మాచ—నిజము ముమ్మాటికి నిజము. లోకులాడిపోసుకొననిమ్ము యిదిమాత్రము యథార్థము. అనృతమిసుమంతయు లేదు.

భీమ—అట్లైన నీతోమాట్లాడువాడు, నాతోమాట్లాడునా?

మాచ—ఎందుకు మాట్లాడడు? యింత జేసిన మహానుభావుడు యెందులకు మాట్లాడడు? తప్పక మాట్లాడును. మాట్లాడితీరును నమ్ముము.

భీమ—సరే నీతో మాట్లాడువాడు నాతోమాట్లాడునా?

మాచ—ఆతప్పక మాట్లాడును. దర్శనమిచ్చితీరును. నమ్ముము. ఆఅనాధనాథుడు నీకు వరమొసగి తీరును. నిన్నుగన్నవాడు నీతోమాట్లాడడా ప్రార్థించుము. నీకు త్రోవజూపును నాకీ యవమానము తీరును.

భీమ—రాయి క్రిందబారవైచి కాళ్ళకు నమస్కరించి, అమ్మా! తక్షణము బయలుదేరి పోయెదను సెలవు.

మాచ—భోజనముచేసి వెళ్ళుము.

భీమ—చేయను. దీక్షపూనితిని క్షమించుము.

మాచ—ఆమహామహుడు నీకభీష్టసిద్ధి లొసగుగాక. త్రోవనుజాగ్రత్త అడవీప్రదేశము మృగభయము మెండుగాయుండును.

భీమ—అమ్మా! ఆసర్వేశ్వరుడే త్రోవజూపును. భయమేలనమ్మా. భయములేదు. దీనదీక్షాపరునకు భయమెక్కడిది.

మాచ—(కొంతదూరము సాగనంపి) నాయనా! ఆపరమశివుని దర్శించి వరములుగొనిరమ్ము.

## రంగము

[త్రోవనుజనుచు భీమన్న]

ఉ. శ్రీకరుడక్షునాత్మజను చేకొని నర్ధశరీరమిచ్చినీ
ప్రాకటవై భవోన్నతులు భవ్యసురాసురులెల్లమెచ్చగా
సాకుచునంతపీఠమున సంతసమొప్పగ జేర్చినట్టియో
నాకసిఖావతంసనిను నాత్మదలంచెద నెల్లవేళలన్.

భీమ దేవా! యిదే నీకు నమస్కారము (కాని) ఆదక్షపురీధాముడీడు పల్కడా! ఏలపల్కడు? భక్తపాల బిరుదాంకుడట గదా! యాలెడు! వక్రగతుండగు భస్మాసురునికే వరములిచ్చిన శూలపాణి నాకేల దర్శనమియ్యడు. వరమిచ్చియే తీరును. వరమొసగకున్న యేమిచేయుట? చేయుటకేమున్నది? మరణమే. ఆ నేను మరణమొందుటో! యెంతయవివేకము! కన్నకొమరుని దయచూడకున్న యికనెవ్వరిని కాపాడును? పూర్వులనుకొన్నవి వట్టిమాటలా? ఆతడుగాపాడకున్న మహాజనని మాణిక్యాంబయే గాపాడును సంశయములేదు.

పాట

1. శంభో శంభో శంభో శంభో యనవే – వేడుకతో శ్రీదక్షపురీశుని వేవిధిదలచవే మనసా ॥శం॥

2. అంచితనాధా అమరసుపూజా ఆర్తరక్షణా-అతులితసుగుణా ॥శం॥
3. సుందరరూపా భూతగణాధిప ఆదరించవే – ఆశ్రయించితిని ॥శం॥

(అని పాడుచు ద్రాక్షారామము సమీపించి)

అదుగో! భీమనాధుని ప్రాకారగోపురాదులు. అదుగో! సప్తగోదావరీసుతల్లి! ఆహా! నేనెంతధన్యుడను. (అనిచేతులు జోడించి) తల్లీ!

శ్లో॥ నిత్యానందకరం వరాసుకకరం సౌందర్యశోభాకరం
నిర్మోహం భయతంతు పాపశమనం సామ్రాజ్యమోదప్రదం
భక్తాపాలనయోగజీవనకరం శ్రీసప్తగోదావరిం॥

అమ్మా! సప్తఋషిప్రోక్త నిర్గతగంగాప్రవాహమా పాంథ జనకల్పభూజమా.

చ. కుడువవుమేతగాపరిని గోరవు శృంగముతోడ నెవ్వరిన్
బొడువవుకాళ్ళదన్నదొకపూటయు నూధమువట్టిపోవుటన్
నడిగినవారికెల్లరకు అచ్ఛపయః పరిపూర్ణ నీరముల్
వడినిడుతల్లి నీవెగద పాంథుల పాలిటికామధేనువా.

సర్వజంతు జీవనాధారమా సప్తగోదావరీమతల్లీ. నిన్ను కామధేనువని స్తోత్రము జేయ చెల్లును. సప్తఋషిప్రోక్షిత కాసారంబవటగాదా, సప్తగోదావరి సలిలసంగమంబని వింటిని. ఔను. నిజమే కాకున్న నీకీమహాత్మ్యమెట్లబ్బెను. నీరంబుగ్రోలి పాపంబులు పటాపంచలగునట ఓతల్లీ నీకిదే నమస్కారము. (అని దరయేగి జని నమస్కరించి స్నానమాచరించి గర్భాలయమునకు జని స్వామినిజూచి ఆశ్చర్యపులకితగాత్రుడై) ఆహా! యీదివ్యమంగళవిగ్రహమును నేనెంతని వినుపింతును. హే మన్మదాంతకా! భక్తదీనపరాయణా బాలచంద్రావతంస! శంభో భోగీంద్రభూషణుండవై జాహ్నోద్ధూళితవిగ్రహుండవై,

గజచర్మపరాధీనుండవై, దిగంబరో తాండవా జ్వాలుండవై, హరిబ్రహ్మేంద్రాది గీర్వాణాభివందితుండవై, ఆకాశసింధు కల్లోలమాలికాచారు మస్తకుండవై, యశేషభువన త్రాణ జాగరూకేక్షణుండవై, కైలాసంబున నిండుపేరోలగంబుండి భక్తాభీష్టంబులుదీర్ప భువికరుదెంచి, మామపురంబున కాపురంబుడి; భక్తులకోరువరంబులీడేర్చి వారలతరింపజేయు నీ దివ్యమంగళవిగ్రహంబున కిదే వందనములు దేవా !

సీ. సకలపాపంబులెల్లను సమసిపోవు
దక్షపురినున్ననీదగుదర్శనంబు
కాపుమోయయ్య నన్నికన్ కరుణతోడ
దర్శనంబిమ్ము నీవాడదనియువాడ.

హేశంకరా పాపభయంకరా కరుణించవా నీదివ్యసందర్శనము చూపవా కాపాడవా భయముబాపవా.

శ్లో॥ వందేశంభువుమాపతిం సురగురుం వందేజగత్కారణం
వందేపన్నగభూషణం మృగధరం వందేపశూనాంపతిం
వందేసూర్యశశాంక వహ్నినయనం వందేముకుందప్రియం
వందేభక్తజనాశ్రయంచ వరదం వందే శివంశంకరం॥

హేమహిషాసుర మర్దనీ మనోహరా మహేశ్వరా.

మ. అనుమానించెదవేల జయఘనీ యాతన్ శివాశంకరా
మనసంచెప్పుడు జేయడంచితడునా మర్యాదగాదంటివా
గనవే నాదుమనఃప్రపూర్ణితలతా కామ్యంబులెల్లప్పుడున్
వినుమా దెల్పెద వేరువేల్పులను నే నెన్నండు పూజించితే.

నీపాదపంకేరుహంబులు తప్ప యితరమెరుంగని నన్నిన్ని చిన్నంబులు గల్గించుట పాడియే దీనదయాపర ఉమామహేశ్వర శంకరా !

శ్లో॥ వందేజీవజనాభివందితబదం వందేమృంగాకాధరం
వందేమేరుశరాసనం విమగళం వందేభవానీంపతిం
వందేమంగళదాయకం గిరిగృహం వందేగణానాంపతిం
వందేవాసవపూజితాంఘ్రియుగళం వందేభవత్యేశ్వరం
వందేసోమదివాకరాగ్నినయనం వందేనందివృషేంద్ర వాహ
గమనం వందేత్రిలోకేశ్వరం॥

స్వామి యెంత దీనాలాపములతో ప్రార్థించినను పల్కరేమి మహాత్మా యిదే శబదము చేయుచుంటిని యిదినిజము మునుహ్మా టికి నిజముదేవా.

ఆ. దర్శనంబొసంగి దరిజేర్చుకున్నను
సిరముగొట్టుకొనుట సిద్ధమయ్య
ఓమహానుభావ ఓమునీశ్వరవంద్య
మాటలాడినన్ను మనువుమయ్య.

హరహర మహాదేవశంభో (యని భీమలింగముపై శిరస్సు పగులగొట్టుకొనబోవ స్వామి ప్రత్యక్షంబై.)

స్వామి—బాలకా! లెమ్ము ఆత్మహత్య మహాపాపము.

భీమన్న—(కన్నులుదెరచి చూచి నమస్కరించి నిలుచుండ)

స్వామి—తనయా! యిట్టి యవివేకపు పనులు జేయుటబాడియా ?

భీమ—స్వామీ మీదర్శనము లేకున్న నాజన్మ నిరర్థకముగదా యని యూహించితిని.

స్వామి—భక్తుని మానసము నిరర్థకమెట్లగును.

భీమ—నిరర్థకముగాదా యేకోర్కెతోప్రార్థించునో యాకోర్కె నెర వేరని శరీరమే నిరర్థకము

స్వామి—సరే నీకోర్కెదెల్పి సార్థకశరీరుడవు గమ్ము.

భీమ—మీరు మాజనకులని మాతల్లి జెప్పినది నిజమేనా ?

స్వామి—ఆ నిజమే.

భీమ—దేవా నీ నందనుండనైనందులకు జనులు రండాపుత్రుడనుటయేనా మహాత్సవము.

స్వామి—కర్మ తప్పింప నెవరితరము గతించినదానికై వగవక యెద్ది కావలయునో కోరుకొమ్ము ?

భీమ—నన్నతి నీచముగా బల్కకుండుట విద్యాభాగ్యంబులొసంగి రక్షింపుము.

స్వామి—అట్లే నీనాలుక ని[illegible]మము.

గీ. జీవులను పుట్టగిట్టింప [illegible]లసునట్లు
విద్యభాగ్యంబునీవెంట వెలయుగాక
సంతతానందవీధికల్ జనెదవయ్య
వరమొసంగితి జనుమింక వాస్తవంబు. (అని అదృశ్యుడగును)

భీమ—(సర్వవిద్యాపారంగతుడై స్వామికి నమస్కరించి) ధన్యుడను. ఆనందమయుడ (చేతులుజోడించి)

సీ. కైలాసపతి మృగాక్ష్యైశివాయైనమో
మాధవాప్తాయ నమశ్శివాయ.
మంజువాక్యైసర్వమంగళాయైనమో
మదనాంతకాయ నమశ్శివాయ
శ్యామలకోమలాంగ్యై భవాన్యైనమో
మధిత మయాయ నమశ్శివాయ
నానాజగజ్జనన్యై మృడాన్యైనమో
మధితమయాయ నమశ్శివాయ

గీ. మహితశిఖవాహనేత్రే నమశ్శివాయ
మణిమయవిభూషణాయై నమశ్శివాయ
మంత్రమణిపీఠికాయై నమశ్శివాయ
నన్నుపాలించిబ్రోచిన నవ్యగేయ.
ఆహా! నాయదృష్ట మేమనవచ్చును !

శా. సాకల్యంబుగ సర్వశాస్త్ర విధులన్ సంశోషిత స్వాంతుడై
నాకాశోజ్వల కేశపాశుడ హాహా నాతండ్రి నన్ గావగా
నీకే నేరిక నెల్ల వేళలనుగా నేడింభకా యంచు నా
లోకాలోకవిభుండు పల్క యిక నేలోటుండు నా ధన్యుడన్.

యికనింటికిజని నానాదుర్భాషలాడిన మాజననిని తప్పుసైప ప్రార్థింతును గాక (అనిచనును.)

రంగం—మాచమ్మవిచారంతో

మాచ—నాచిట్టితండ్రి! స్వామిదర్శనమునకు వెళ్ళి యింకను రాకుం డుటకు కారణము తెలియదు. పట్టుదలగలవాడు. యే అఘా యిత్యమైనను జరుగలేదుగదా. మార్గముదెలిసి సుఖముగా వెళ్ళెనోలేదో. భీమనాధుడు దర్శనమొసగెనోలేదో. యెన్నడు నన్ను విడిచి ఒంటరిగా యిల్లువిడిచి ఒక్కరాత్రియైన ఉండ లేదు. యిప్పటికి ద్వాదశరాత్రులు గడచినవి. వానినే యాధా రముగా జేసుకొని గంపెడాసతో నుంటిని. సర్వేశ్వరా! దీన బంధూ నాపుత్రుని సుఖముగా నావద్దకు బంపుము. నీ కిదే వందనశతంబులు (దూరమునచూచి) అదుగోవచ్చుచున్నాడు. నావరాలుమూట. నాకన్నతండ్రి అదుగో. అదిగో. నాచిట్టి తండ్రి అదుగో. నాయనా రమ్ము రమ్ము ఎన్నాళ్ళకు జూచితిని రారమ్ము. కండ్లు కాయలుకాయుచున్నవి. (అనిచేతులుచాచ)

భీమ—(దరియంజని, పాదములపై వడి) మాతా అపరాధిని క్షమించు నినన్ననిందావాక్యములకు మనస్సు చలించుచున్నది తల్లీ !

సీ. పుట్టినదాదిగా బెంచి పూర్ణుని జేసి
మహనీయమూర్తియా మాతృఋణము

లాలించి మేలెంచిలీల మాటలు నేర్పి
దయజూచునట్లు యీ తల్లిఋణము
రోగముల్ రానీక నిరోగవంతుని జేయు
ఆరాటముననొందు అమ్మఋణము
విద్యనీతులుజెప్పి విజ్ఞానినొనరించి
మరువరానట్టి మా యమ్మఋణము
గీ. దీర్చుటకు బుట్టినట్టి నే దీరనట్టి
బాధగల్పించి నిన్ను నే బాధబెట్టి
మాటలంటిని తల్లిరో మరువవమ్మ
అమ్మమాయమ్మ క్షమించ వమ్మనన్ను.

మాచ—తనయా యిప్పటికైనను యదార్థము తెలుసుకొని నానింద బాపితివి. అదియే పదివేలు (అని లేవనెత్తి) నాయనా జాగ్రత్తగా వెళ్ళివచ్చితివా. ఆ పరమశివుడు దర్శనమిచ్చెనా యేమనెను? దయగాజూచెనా.

భీమ—ఆభీమేశ్వరుడు యెంతదయగలవాడమ్మా! నేను ప్రార్థించుట తడవుగా ప్రత్యక్షమై సర్వవిద్యాపారంగతుని జేసెను. కీర్తితో నుందువనెను. విచారించవద్దని మీతల్లితో జెప్పుమనెను. ఎంతభక్తదయాపరుడో చూడమ్మా ఆతడు.

మాచ—నాయనా మనకిలవేల్పుగదా ఆమహామహుడు ఎందులకు దయచూడడు.

భీమ—ఔనమ్మా చూచినాడు గదటమ్మా ఆశంకరుడే చూడకున్న మనగతి ఏమగునో

మాచ—సర్వేశ్వర సంకల్పము మనశక్తి యేమున్నది

భీమ—ఔ నంతియేనమ్మా.

మాచ—నాయనా వేళతిరుగుచున్నది. భోజనమునకు లెమ్ము.
భీమ—కాదమ్మా వచ్చేటపుడు జూచితిని విశ్వపతిశాస్త్రి గారింటిలో అబ్దికమట బ్రాహ్మణులు వెళ్లుచుండిరి నేనుసూ వెళ్ళివత్తును.
మాచ—వద్దు పోవద్దు వారికిని మనకు విరోధముగా యున్నది
భీమ—విరోధ మే మమ్మా మానవజాతియున్నప్పు డేవిరోధము తప్పదు. లేకున్న యేవిరోధములేదు గదా.
మాచ—ఎంత విజ్ఞానము సంపాదించివి తండ్రి వద్దు పోవద్దు పెద్దదానను జెప్పుచుంటిని వినుము.
భీమ—ఏమైనను వెళ్ళక తప్పదు. యిదేవెళ్ళుచుంటిని (అని జనును)

రంగము—విశ్వపతి

విశ్వ—యింత ఆలస్యమైనను భోక్తలురారైరి. అపరాహ్ణము తిరుగుచున్నది. వంటలు సిద్ధమైనవి. వారు పెందలకడ వచ్చిన బాగుండును. మాబ్రాహ్మణ పద్ధతులే బాగులేవు. తండ్రి లోకపద్ధతి పిల్లలొక పద్ధతి అన్నగారొకపార్టీ తమ్ముడొకపార్టీ యెన్నియనుకొన్నను మాకుమించిన జాతి లేదనవచ్చును సీతారామాభ్యానమః మొదలు సింహాస నాసీనులవరకు మాజాతియే విద్యలోను, రాచకీయములోను, యుక్తిలోను, అగ్రస్థాన మలంకరించుట లోను శుభాశుభములు మావాళ్ళు లేనిదే యితరులకు గతులుసున్న. కవులుమావాళ్ళు మంత్రులము మేము కానిపులినిజూచి నక్కవాతలుబెట్టుకున్నట్లు మమ్ముల అనుకరించబోయి అడుసులోఅడుగువేసి బేనలగుచున్నారు. మమ్ములజూచి ఓర్వలేకున్నారు. మాసంఘు కట్టడికై యోర్వలేక వారివారిసంఘుములు యేర్పరచజూచుచున్నారు. వారిలో వారికే కుదరదు. వారిసంఘుములేమిటి నామొహం

మాలో యెన్నో శాఖలున్నను యేకశాఖగా యేకసంఘముగా సంచరింతుము. వాళ్ళమొహం వాళ్ళకు కుదరదు. కనుకనే యిన్నికోట్లప్రజలలో మాజాతితక్కువైనను మేటివాళ్ళమైతిమి. మావాళ్ళపేరు జెప్పిన ప్రభువులే హడలుచుందురు. యీ మేకలగుంపులెక్కయా అదుగో వచ్చుచున్నారు ఏమండీ యింత ఆలస్యమేల అపరాహ్ణము ఔరుగుచున్నది. వంటలు సిద్ధమైనవి. లెండు స్నానమునకు.

అందరు—నిజమే క్షమించండి. స్నానము జేసియే వచ్చితిమి.

భీమ—అదుగో బ్రాహ్మణబృందము లోపలకు వెళ్ళుచుండిరి వారితో వెళ్ళి పీతిగా. భుజింతునుగాక (అని వారితో కూర్చొనబోవ.)

1 బ్రా—మనసహపంక్తిని కూర్చుంటున్నాడు వీడెవడు? రంఢాపుత్రుడా! ఒరే కుర్రా రాకురా!

భీమ—రావద్దనుటకు మీరెవరు ?

2 బ్రా—ముదిరేసురా!

3 బ్రా—ముదరకే! మీమాటలుకూడా ముదిరినవి

1 —మునుపటికన్న రంగొచ్చేసురా కుర్రోడు

2 —యెందులకురాడు ముగ్గురకు ముద్దుబిడ్డడు

భీమ—మీయిష్టమువచ్చినట్లు మాట్లాడుచున్నారే

1 —ఏమిరా కొడతావా

3—శపిస్తావా

4—కరుస్తావా

1—పొడుస్తావా

3—మంచిపెంకితనముగా మాట్లాడుచున్నాడురా.

భీమ—పెంకితనమేముంది మీరన్నమాటలకు నేనంటిని.

3—యిక్కడికెందుకు వచ్చితివి.

భీమ—యిక్కడికెందుకు వచ్చితినా ముక్తి పేరుబెట్టి గృహస్థుల పాడుచేయువారెక్కడికో యక్కడికి

4—పిట్టచిన్నది కూతఘనము

2—కాకేమి వాడికున్న తెల్వి ఘనకుండునా.

1—ఒకే మాటలకేమిగాని యిక్కడ ఉండుటకు వీలులేదుపొమ్ము

భీమ—కారణము?

3—మీరు వెలియందుంటిరి.

భీమ—ఏమిటీ స్త్రీపురుషసంసర్గముచే పుట్టినవానికా వెలి. పుట్టని వానికావెలి. జాతిమతములు దెలిసినవానికావెలి. దెలియని వానికావెలి. ఆత్మకా దేహమునకా వెలి. ఈరెండుకానివానికా వెలి. యెవరికి నానాఋషిసాంప్రదాయులకావెలి. లేక పరమే శ్వర వరప్రసాదికా వెలి (ఆత్మనాం సర్వభూతాని యన్న సర్వభూతములకా వెలి యెవరికి.

విశ్వ—ఆలస్యమగుచున్నది ఆ వెధవతో వాగ్వాదమేమిటి రండి కూర్చోండి. వడ్డనలైనవి. (అని భీమన్న నావల త్రోసితలుపు వేసుకొనును.)

భీమ—ఎంత నిందాస్పదముగా మాట్లాడి యీవలకు త్రోసి తలుపు వేసుకొనిరి. సకలచరోద్ధారకుండగు కైలాసవాసుని నందనుం డనై వీరలచే పోటుమాటలు వినవలసివచ్చెను. 'అహా కాల మహిమ. వీరిపొగ రడచెదగాక యిప్పటికి వడ్డనై యుండు. అదుగో అపోశన పట్టుమనుచున్నాడు యీఆపోశనతో యీ పెద్దలు.

ఉ. గొప్పలు చెప్పుకొంచునను గూటికి బంక్తికి రాకుమంచు నీ
తిప్పుడు చాపలందరును దిట్టిరి గావున నొక్కమారు మీ
యప్పములన్ని కప్పలగు యన్నము సున్నముగాగమారుచుఁ
బప్పును శాఖముల్ బులుసు బచ్చడులున్ చిరుతాలుగావుతన్.

నేనన్నవిధంబున జరుగుగాక అప్పటికిగాని నాకోపంబు చల్లా రదు. దూషించిన నయ్యలు కొయ్యలగుగాక.

విశ్వా—యిది యేమిచిత్రము? భోక్తలు యొక్కసారిగా నిజీవులైరి ఇది యేమి ధారుణము (అని వణకుచు) యీసంగతి విన్న నాశరీ రము కంపము జనించుచున్నది. (కప్పలు దుముటచూచి) యిదేమి చిత్రము కప్పలు మీదకు దుముకుచున్నవి. అన్నము సున్నమైనది. హా శ్రీహరి యీశవములేమి! యీసున్నమేమి! ఈచిరురాళ్ళేమి? మంచిది. ఈకప్పలెందుండి వచ్చినవి. తండ్రి తద్దినమని బిల్వ వీరందరు మడియ యెవ్వరైన చూచిన హాని వాటిల్లదా! తప్పకహానియే ఒక్కహానియేగాదు. రాజశాసన ముచే యురికంబ మెక్కవలసినవాడనే పోనీ వీరలపారవైతు నన్న ఒక్కడా నల్గురుండిరి. వీరల రహస్య స్థలముల దాచ గలనా దాచుటగూట కష్టమే! శ్రీహరీ యికనేదిత్రోవ.

ఉ. తద్దినమంచు బిల్వగను తప్పకవచ్చిన భోక్తలెల్ల యీ
తద్దిన మ్మున్నమైన దినుధాతయొకండును లేడు చూడగా
అద్దిర బ్రిహ్మవీరలను నంతకు చెంతకు బంపియుండ నా
పెద్దపురకంబు జూచెదర పెద్దలు పిన్నలు బవ్వదట్టకట.

కాన్యియిట్టి ఆశ్చర్యము యేయుగంబునను కనియెరుంగము. నాయందసూయచే యెవ్వరైన సమ్మోహనాస్త్రము ప్రయో గించెనా! నాయందిగ్రామమున కెవ్వరికి అసూయలేదే. నేన వ్వరికి అపకారినిగానే! (ఆలోచించి) ఆ దేలసినది. యింత కిత్రము ఆవిధవాపుత్రుని దూషించితిని. అతడే యిట్లుజేసె నేమొ. అతడంతఅసమర్థుడా. యేమో యెవ్వరెరుగుదురు. సరే. పల్కరింతుగాక నిక్కము తేలును. యాతడుగాకున్న యీదారుణ మాతనిపె మోపి నేను యీదారుణమునసుండి

తప్పుకొను మార్గము నూహించితిని బలే మంచియూహ
(అని తలుపుదెరచి యాతనిజూచి)

భీమ—అదుగో తలుపుదీయుచున్నారు. నన్ను బిల్వవత్తురుగాబోలు నేను రానని నిష్కర్షగాబల్కుదును. అదుగో కర్తయే వచ్చుచున్నాడు. విశ్వేదేవపూజానంతర యన్నంబు జలంధిం గల్పుటకు గాబోలు. కాదు కాదు వట్టినే వచ్చుచున్నాడు. కార్యమేలకో.

విశ్వ—అదుగో యిచ్చటనే యున్నాడు. భీమన్నా యిచ్చటనే యుంటివా! రమ్ము లోపలకు యింతక్రితమన్నమాటలకు కోపగించితివేమో యని మరలవచ్చితిని.

భీమ—రాను. నానాదుర్భాషలాడి వెలియుంటిరిగదా.

విశ్వ—ఔను నిజమే పొరపాటు క్షమించుము.

భీమ—క్షమించ నేనెంతవాడను రండాపుత్రుడనుగదా

విశ్వ—పోటుమాటలు చాలించి నాతండ్రిగారి ఆబ్దికము చెడకుండ చేయప్రార్థన.

భీమ—ఆబ్దిక మెట్లు చెడును? కారణము.

విశ్వ—అంతయు తమకే విశదము నాచే అనుపించ దలచుకొంటిరి. గాన వినండి.

సీ. తద్దినంబనిబిల్వ తప్పకవచ్చిన
భోక్తలెల్లరు కర్రమోడులైరి
వంటబ్రాహ్మణులు వడ్డించు నన్నంబు
సున్నమై నెగడెను సుగుణవర్య
పితృలకును బెట్టు పిండివంటలు నెల్ల
కప్పలై గూసెను గొప్పగాను

పచ్చళ్ళు గూరలు పప్పు దప్పళములు
చిరురాళ్ళగా మారె చిత్రముగను
గీ. అహాహా యెమని జెప్పుదు అనఘ నీదు
మహిమ యెల్లను గంటిని మాకునిపుడు
వరమొసంగియు బ్రోవుము వరయుతుండ
జీవులను బ్రోచి రక్షించు జీవధనుడ.

కావునవారల రక్షించి నన్నుకాపాడి పుణ్యము గట్టుకొమ్ము.

భీమ—నే నన్నవాక్యములు తథ్యములయ్యెను కాబోలు. యిక నాయట్టివాడు లేడు. యితని దీనాలాపములు చూడ జాలక యుంటిని. శాస్త్రి గర్వమడగెనా?

విశ్వ—(నమస్కరించి)..చిత్తము పూర్తిగా యుడిగినది రండు (అని లోనకు తీసుకొనివెళ్ళి) బాబూ వీరల చూచితిరాయెట్లుండిరో

భీమ—యిది యంతయు నాతండ్రి వరప్రభావము యికపునర్జీవితుల జేసెదగాక.

మ. ఘనుడౌ వేములవాడ వంశజుడు ద్రాక్షారామ భీమేశనం
దనుడీ భీమనయంచు గుర్తెరిగి నిందల్ మాని సగౌరవం
బున నీవిప్రులిటు జూచిరందువలనన్ బూర్వస్థితిం జెంద భూ
జనవస్తు ప్రకరంబులన్నియు యథా స్వస్తంబులే గావుతన్.

యథాప్రకారముజెంది యీకొయ్యలెల్ల అయ్యలగుగాక (అన యథాస్థితి నొందును)

1, 2, 3, 4—పరమపవిత్రుండగు యి బ్బాలు ని అవాచ్యము లాడితిమి. యీతని కాగ్రహము జనించబోలు తప్పులు సైప ప్రార్థింతుముగాక ! (అనిచేతులు జోడించి) మహాత్మ !

సీ. 1. లంకాధిపతియు జానకిని గొంపోవగ
పతనసేసిన రాము బాణమనగ
2. నిషధేశుభార్యని విషపుసర్పము మ్రింగ
వడిగచంపు కిరాతు వజ్రమనగ
3. త్రిపురాసురుల్ ఘన తాపసల్ నొప్పింప
సోమశేఖరుడేయు శూలమనగ
4. అగ్రతాంబూలము యందగా శిశుపాలు
చక్రిగొట్టిన యట్టి చక్రమనగ

గీ. 1. అట్టిమీవాక్యధాటి నీ యవనియందు
2. మమ్ము చండించె బ్రతికించె మనసు లలర
3. దండములు గొంచు మాతప్పు దడయకిపుడు
4. రక్షణము చేయుమో కవి రాజవర్య.

మాతప్పిదములు గాచి మమ్ముల కృతార్థుల జేయు మీ పాదముల కిదే వందనశతంబు.

విశ్వపతి—మహాత్మా తమకీ మహాత్మ్యమేల గల్గినది ఎట్లువచ్చినది.

భీమన్న—నాజనకుండగు భీమేశ్వరస్వామి కరుణావల్ల.

విశ్వపతి—ఆలస్యమెందులకు భోజనమునకు లెండు. తమ మాతా పితృలకొరకు కబురంపితిని వచ్చుచుండిరట లెండు.

ఇది తృతీయాంకము సమాప్తి.



# శ్రీ భీమేశ్వర మహాత్మ్యము

## చతుర్థాంకము

[భీమకవి-ఒంటరిగా]

ఏమహానుభావుని కరుణాకటాక్షముచే నింతటి వాడనైతినో యేదివ్యపురుషుని స్మరణ మాత్రంబున సమస్తపాపములు పటాపంచలగునో యేసుందరాకారు దివ్యమంగళ విగ్రహ సందర్శనము కొరకు మహామహులగు యోగీశ్వరులు నిరత సంతోషస్వాంతులగుదురో యేమహానుభావుని దయారసంబున యెనుబది నాల్గులక్షల జీవరాసులు బ్రతుకగల్గెనో యట్టి సుగుణమేటి దేవతాచక్రవర్తి మజ్జనకుండగు ఆపరమేశ్వరానుగ్రహంబున గాదే నిర్విక్రమ యశోడిండిముండనై భీమకవి మాళీయని నన్నుబిలచునట్లు జేసిన ఆమహామహుని యెన్నివిధముల స్తోత్రములు జేసినను యెన్నివ్రతము లహర్నిశంబుల్లు సల్పినను దీరదు. దేవాదిదేవా నీకిదే వందనశతంబు. (నిదానించి) నేనీయూరనున్న నావిద్యామహత్వము వెల్లడి గాదు. యింటనున్న సంజీవ మొక్క ప్రాణము గాపాడున దైనను దానియందుపేక్ష వహించునట్లు నావిద్య మావూర కొరగాదు. కాని నేనెవ్వరి నాశ్రయింతును. నన్నెవ్వ రెరుంగుదురు. ఆ యెరుగకున్నమాత్రమున లోటుఖగల్గునా.

కవిత ధనమిచ్చు యోగ్యత గల్గజేయు
సభల యందున ప్రభవెల్గు సంతతంబు

కీర్తి వెలయును నెల్లెడ కృతులవలన
కవిత నేర్చిన వారికి గలదె లోటు.

అదుగో సమయమునకు శఖుశాస్త్రి వస్తూయున్నాడు. పెద్ద వాడు పండితుడు మంచివాడు ఇట్టివానిని వెంటబెట్టుకొని వెళ్ళుట మంచిది. శాస్త్రీ రమ్ము.

శఖు—ఆ వస్తూయున్న (అని క్రిందుమీదుగా చూచి) నవ్వుచు ఓహూ యీ సందడంతా యేమిటయ్యా మహాశయా మిమ్ము లను చూస్తె గర్భాదానపు పెండ్లికొడుకల్లే ముస్తాబైతిరి ప్రభువువారు యెందాకా యీహడావుడి.

భీమ—ఎక్కడనుండి వచ్చుచుండిరి యింత క్రతము మీకొరకాలో చించుచుంటిని.

శఖు—ఎక్కడనుండియా ఆంధ్రమాత ఆరళ్ళు వడుచుండ ఆకలిమంటతో నొప్పులతో లంచబాధతో దళారీలతో సంఘభాధతో బురకాదార్లతో స్తోత్రదారులతో ఒకచో కౌరవపాండవ యుద్ధములాగున స్వతంత్రుల రాజ్యాకాంక్షాపరుల యుద్ధములు వారు వీరుకలసి ప్రజలబాధింపులు తాలింపులు క్షామపద బజాయింపులు ప్రజల నేడ్పింపులు పన్నులబకాయింపులు పుస్తుల నమ్మింపులు లేనివానినేడ్పింపులు. ఉన్నవాని జడిపింపుము. యివన్నియు కట్టగట్టి మోయలేక ఆంధ్రతల్లి ఆరాటముచూచి కన్నీటిధారలు విడచుచు తాపత్రయ సముద్రమున వడి తన్నుకొనుచు యిప్పటికి తెమల్చుకొని యిల్లుజేరి గృహిణి రెయొకపనులు నారవేర్చుకొని మీదరికి జేరుకొంటినివి ఒంటిరా.

భీమ—నీవన్నట్లు ప్రపంచమా విధముగానే యున్నది. యిదియంతయు కాలముయొక్క మార్పుగదా.

శఖు—నామొహం కాలమేమిటి కాలము అన్నివేళలా యొకేవిధము ఆయనములు ఋతువులు మాసములు పక్షములు తిథులు నక్షత్రములు వారములు లగ్నములు యొకేవిధముగదా జ్ఞానము నశించి వక్రబుద్ధులు ఆశాపాత్రులు అన్యాయపరులు బయలుదేరి మానవులు వేరుగారా! రాక్షసులా యన్నట్లు సంచరించుచున్నారు. వీరల ననవలయును గాని కాలమేమిచేయును! దివారాత్రులు యొకట్టేగా.

భీమ—కాదన్న దెవరు ? మానవజాతికే యిన్ని వక్రగుణములు తిర్యగ్జంతువులు మాత్రముచూడు అన్యోన్యముగా యుండును. సర్వజ్ఞానము·· తెలియుటచేతనే యీమానవజాతి కింత ప్రమాదము.

శఖు—అయితే మానవజాతి నశించిన బాగుండుననియా మీయూహ. అదిలేకున్న చెప్పుకొనువా రెవరు ?

భీమ—కాదు. న్యాయాన్యాయము లెరిగి సంచరించు వారున్న లోకము ప్రకాశవంతమగును లేకున్న రాక్షసవంతమగును అశోకుని సమయములో జూచితివా యెంతటి మహోన్నతి నొంది అన్యోన్యముగా నుండిరో.

శఖు—యిపుడున్నవారందరు రాక్షసులా !

భీమ—ఏమో కొందరుండవచ్చును. లేకున్న కర్కోటక విషజ్వాలల వలె మహాప్రళయమే సంభవించును.

శఖు—యీమాటలకేమి మన ప్రయాణ మే త్రోవకు ?

భీమ—ఏమున్నది మంచివాని నెవ్వనినైన చూచుటకు.

శఖు—మంచి వాడంటే ?

భీమ–ఉ. ప్రేమము సత్యమున్ దయయు ప్రీతిజనానుగుణంబువిద్యయున్
నీమము దేశభక్తి సుజనేతరులన్ కఠినస్వభావమున్

ధీమహితుండు సర్వజన ధీరుడు యాతడు మానవాళిలో
నామహనీయుడే ధరను అప్పుడు పూజ్యుడు జమ్ముచూడగా.

అట్టివారి దరికి జేరిన బంగారునకు తాలి యబ్బునట్లుండును

శఖు—అట్టివా రరుదంటిరిగా

భీమ—కనుక నే యింత ఆలోచన

శఖు—ఎవరున్నారు లేరు యీకాలములో

ఉ. జూదము లంచమున్ కపట జోతులు మత్తులు గర్వపోతులున్
మీదగు ప్రాణమానములు మేము హరింతు మటంచు బల్కువా
రేదయ జూచెడివారలు లేరుగదయ్య యిప్పుడధారిని
బ్రోదియొనర్పువార నిక బూజ్యము ధారుణియందు చూడగా.

భీమ—లేకేమి నిదానించుము

శఖు—ఆ జ్ఞాపకమువచ్చినది చొక్కనృపాలుడు మంచివాడనివింటిని

భీమ—నేనును యాతనినే వింటిని కనుక ఆతని దర్శనము తప్పక
చేయవలసినదే. వచ్చెదవా ?

శఖు—సరే మాటవరుసకంటున్నా వరప్రసాదులకు బకరిదర్శనమే
మిటి కావలెనన్న యేదిగాదు

భీమ—నిజమే మనప్రభావము సర్వులకు వెల్లడియగుట యెట్లు ?

శఖు—అట్లైన ఆలస్యమేల శుభస్య శీఘ్రంబన్నారు.

భీమ—ఔను నిజమే (అని ప్రయాణమై వెళ్ళెదరు)

(చొక్కనృపాలుని ఆస్థానము—నృత్యగానవినోదములతో)

చొక్క—మంత్రీ ! దేశసౌభాగ్యము ఆనందదాయకముగదా !

మంత్రి—ప్రజల నిత్యసంతోషమే దేవరవారి కల్యానంద కారణము.

చొక్క—ఔను ! ప్రజలానందముగా వారివారి పనులు నెరవేర్చు
కొనుచుండ వారకేకొరతయు రానీక గాపాడుచున్న ప్రజలు
ప్రభుత్వమును, ప్రభుత్వము ప్రజలను ప్రేమింతురు. అట్లుగాక

ఆశలు గల్పించి అణగద్రొక్కరాదు. ప్రజలను బాధించిన ప్రభుత్వమును ప్రజలు బాధింతురు. యిరువురకు సౌఖ్యము సున్న. ప్రజలను బాధించు ప్రభుత్వమున్నను, లేకున్నను సమానమే. ఆశలు గల్గించి నిరాశావంతుల జేయరాదు. దేశసౌభాగ్యమునకై ప్రాకులాడవలయును.

మంత్రి—తమయొక్క త్యాగము అందరకున్నయెడల భారతమాత యిన్నికడగండ్లు పాలగునా! దరిద్రమనుభవించునా! ప్రభూ.

చొక్క—పొరపడితిని పూర్వమెందరెందరు మహారాజులు తన మాతృభూమికై రక్తము ధారపోయలేదు ?

సీ. బాల్యదశ వీడి ప్రౌఢయై విలసిల్లె
అలభోజు నాస్థానమాంధ్రతల్లి
శాంతి సౌఖ్యాళితో శైశవదశనొందె
యల విక్రమార్క యాంధ్రామతల్లి
రాజరాజనరేంద్రు రాజు నాస్థానంబు
ఆనందమున నొందె నాంధ్రతల్లి
ఆంధ్రభోజ కీర్తి అలరురాయలు చెంతఁ
అతుల సత్కళ నొందె నాంధ్రతల్లి

గీ. ఘల్లుఘల్లున ప్రీతితో గంతులిడుచు
కలితసాహిత్య గానకలాపరతుల
కీర్తి జేగంట మ్రోగించి కెరలెనయ్య
భారతీదేవి తనుగన్నఁ ప్రభులజూచి.

చొక్క—మరచితిని వేములవాడ భీమకవియట గొప్పవాడట వింటివా.

మంత్రి—చిత్తము! కర్ణాకర్ణికగా వింటిని. గొప్పవాడని జెప్పకొనుచుండిరి,

చౌక్క—మహానుభావులదర్శనము దేశసౌభాగ్యము. రాష్ట్రాభివృద్ధి కారణములు.

సేవ—ప్రభూ! భీమకవిగారట వచ్చియుండిరి. సెలవా!

చౌక్క—త్వరగా ప్రవేసింప జేయుము. మంత్రులారా! యెదురుగా జని తీసుకొని వత్తమురండు.

మంత్రి—చిత్తము.

చౌక్క—(ఎదురుగాజని) కవిసార్వభౌముమా! నమస్కారము.

భీమకవి—దీర్ఘాయుష్మాన్ భవ.

చౌక్క—యీ ఆసన మలంకరింపుడు.

భీమకవి—రాజా! నీరాజ్యప్రజలకు నీకునూ కుశలమా!

చౌక్క—తమ ఆశీర్వచన ప్రభావంబున.

శఖు—ఉన్నమాటలన్న ఉలుకెక్కువందురు రాజా మామహారాజున కానందము కవులకు మీయట్టివారి దర్శనమున కానందము. బీదలకు ఋణము. అధికారుల కాశ. నిరధికారులకు నిరాశ. సామంతులకుగర్వము.సంసారులకుసాయము.సానులకు సరసులు దరిద్రులకుధనముదోవుడుగాండ్రకు చీకటికన్యలకువెన్నెల ఆనందముగాకమరేముండును.వీరుమాగురుతుల్యులు మీరు వీరికి శిష్యసములు. ఒకరు సంపన్నులు ఒకరు మహానుభావులు యీ రెండుకలసి అర్యావర్తమానందమున్న ముంచిన మీ కానందము. దేశమునకు క్షేమము లేకున్న కామము. మహారాజా నేనిట్లంటినని గినియకుడు దేశ మధోగతి పాలగుచున్నది. అందులకే యీమహనీయునితో కలసి మీయట్టివారలతో జెప్పి బాగొనర్ప ప్రచారము సాగించితిని దీర్ఘాయుష్మాన్ భవ.

చౌక్క—శాస్త్రిగారు మీరలన్నది గూడ నిజమే యీమహనీయుని దయయున్న నాశక్తికొలది దేశసౌభాగ్యమునకై పాటువడెదను

శంఖు—నాకదియే పదివేలు మీకు వెయ్యేళ్ళు

భీమ—రాజా నీమంచిగుణంబులు విని ప్రప్రథమమున నిన్ను జూడ వచ్చితిని

చొక్క—చిత్తము తమదయయున్న అంతియే చాలు మరచితి తమ నామధేయము.

భీమ—రాజా!—సీ. తిట్టిన తిట్టు మొత్తిన పిడ్గువై వడి
నతిభయంకరముగా నడచికొట్ట
కరుణించి దీవింప కైలాసపతి మెచ్చి
యిచ్చిన వరముగా నెసగమెసగ
శాపంబుబెట్టిన సద్యోని నిర్భిన్న
భక్ష్యభాండములెల్ల బయలుపడగ
క్రమ్మరించిన శాప కాండంబు లెల్లను
వడిపటాపంచలై యడిగిపోవ

గీ. నిగ్రహానుగ్రహ నియతిమాన
మానసోల్లాసివర్తి సంపత్ప్రపూర్తి
ఘనుడ వేములవాడ భీమనకవీంద్ర
యంచు బిలతురు నన్నింక యవనిలోన.

అదియునుగాక పృథ్వీరమణా!

సీ. ఘడియలోపల దాడి గడగిముత్తునియగా
దిట్టిమేధావి భట్టుకంటె
రెండు ఘడియల బ్రహ్మ దండి ముండ్లన్నియు
దుల్లదిట్టిన కవి మల్లుకంటె
మూడుఘడియలకు మొనసియత్తినగండి
పగులదిట్టిన కవి బాగుకంటె
నరజాము లోపల జెరువునీళ్ళింకగ
దిట్టినబడభాగ్ని భట్టుకంటె

గీ. ఉగ్రకోపి నేను నోపుదు శపియింప
గ్రమ్మరింప శక్తి గలదు నాకు
వట్టిమానినుపురు పుట్టింప గిట్టింప
ఘనుడ వేములవాడ భీమకవిని.

నృపమాళీ వింటివా నాయొక్కధారణశక్తి నాకవిత్వమహిమ నీయట్టివారలకు జూపక యికవెవ్వరికడ చూపను వెయ్యేల యీ స్తంభము వృక్షముగా జేతుచూడుము.

శా. ఆనీతాబ్జపదాన శృంఖల పదా జ్ఞాలంభిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవినే నిన్ జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవో ద్భవమహాపుష్పోపగుచ్ఛంబులన్
నానాపుష్ప ఫలప్రదాయివగుమా నాకల్పవృక్షాకృతిన్.

చూచితివా ఫలపుష్పవిరాజమానమగు యీవృక్షరాజము సాగను.

చోక్క—మహాత్మా ధన్యుడను నిగ్రహానుగ్రహ సమర్థుడవన మీకేచెల్లును. (చెట్టుదరికిజని పూలవుణుకుచు) నేటికి నేననుకొన్న మేటికవీంద్రుడు దొరకినాడు యితడొక్కడున్న నారాజ్యము సుఖంబుండును. చిరస్థాయిగా యీతనినిక్కడనుండ ప్రార్థింతు గాక.

భీమ—నృపేంద్రా ఆలోచించుచుంటివేల.

చోక్క—మదగజంబును మృగాళనాళమున గట్టి నూహించుచుంటిని దేవా!

భీమ—సత్యశీలంబను త్రాటిచే మదగజమునేగాదు మేరుశైల విహారులగు సర్వులను గట్టవచ్చునుగదా.

చోక్క—నాయందు తమ కృపారసంబున్న నంతియేచాలు.

భిమ—సరియే క్రమ్మరింతు చూడుము.

ఉ. శంభువరప్రసాది కవిసంఘువరేణ్యుడనైన నావచో
గుంభన మాలకించి యనుకూలతనొంది తనూవభావమున్
గుంభినిజొక్క నామనృపకుంజరు పందిట మల్లెశాలకుః
స్తంభమురీతినీతనువు దాలచి యప్పటినట్లునుండుమా.

రాజా యొక్కొక్క భాగము లంతరించుచు యథాస్థితి నొందు చున్నది జూడుము.

చొక్క—కవిరాజా నాయాస్థానంబున కొంతకాలముండ ప్రార్థన.

భీమ—రాజా తొలుదొల్త నీదర్శనమే జేసితిని. నానారాజసందర్శనము జేసి మగల నీయాస్థానమున కొంతకాలము సుఖముగా నుండెద. యిప్పటికి మాత్రము దయయుంచుము.

చొక్క—తమచిత్తము. మంత్రీ శతదీనారములు కానుకగా యీ కవీంద్రులకు బహుమితిగా నిమ్ము.

భీమ—కవిరాక్షసునకు కర్రిగుర్రము.

శఖు—శఖుముఖశాస్త్రికి చిన్నిగుర్రము.

చొక్క—మంత్రీ యీకవీంద్రులకు మంచిజవనాశ్వముల నిమ్ము. కనకాభిషేకము చేయుటకు సర్వము సిద్ధపరుపుము.

మంత్రి—చిత్తము. (కనకాభిషేకము జేతురు)

భీమ—రాజా నీఆదరాభిమానములకు నామనమానంద వీచికల వాల లాడుచున్నది. యిట్టి ఘనసత్కారము జేయవనుకొనలేదు.

శఖు—భామలకు బంగారము, ఋషులకు తపస్సు, యాచకులకు ధాత, కవులకు కనకాభిషేకము, రాజులకు శృంగారము, నా యట్టివానికన్నీ హితులుఆశగాకమరేముండును. యిట్టినిగ్రహాను గ్రహామూర్తిని జేపట్ట యేరాజేంద్రునకు ప్రేమయుండదు! తప్పక మరల వచ్చియేతీరును దేశసౌభాగ్యకరుడవు. ప్రజా దరణ పాత్రుండవు.

భీమ——రాజా సెలవు.

చొక్క——(సాగనంపుచు) కవీంద్రా నమస్కారము.

భీమ——రాజ్యాభివృద్ధిరస్తు.

శఖు——మహారాజా సెలవు.

రాజు——చిత్తము.

## రంగము

[కళింగగంగు ఆస్థానము——మంత్రి సామంతులు]

రాజు——సచివా! శిస్తులు పూర్తిగా వసూలగుచున్నవా?

2 మంత్రి——లేదుమహారాజా! లేదుకొద్దిగా బకాయియున్నవి. గాలివానలచే సస్యనాశనముగల్గెను. శిస్తులు తగ్గించవలెనని రైతులు కోరుచున్నారు.

రాజు——అట్లు చేయవచ్చును. మనవారు క్రొత్తగా నిర్మించిన సభాకార్యములు చక్కగా చెరవేర్చుచుండిరా?

1 మంత్రి——మహారాజా! సంస్థానపురాబడి తగ్గకున్న ప్రజలను తారుమారు జేయనీయండి. పన్నులు జమాయించిన మనకేల!

రాజు——ప్రజలలో అలజడి రాక మానునా!

2 మంత్రి——అవును. అలజడి రానీయండి. ప్రజలుమొరలెత్తనీయండి. వారలకేమి స్వలాభములేగా వారలకేమి గావలయును! దేశము దేశమని. చైతన్యము గల్గించి, పదవు లలంకరించువారలేగా.

రాజు——సరే. దేశము శాంతిగొన్న నాకదే పదివేలు. మరచితి. యీమధ్య దోపుడుగాండ్రు బయలుదేరి గ్రామములు కొల్లగొట్టి గ్రామస్థుల కాసుకొనవలెనని ఆజ్ఞ ఇచ్చితిమిగదా. వారలట్లు చేయుచుండిరా.

1 మంత్రి—ఎవరిని? ప్రభుత్వమునా? ప్రఖ్యాతివహించిన అన్యాయపరు లగు శ్రీమంతులనా దోచుకొనుట. లేక బీదలునా! ప్రభూ! ఎవరిని. వారలు ప్రభుత్వపు జోక్యమునకు రానేరారు. బీద లను ముట్టరు. లెఖకు స్వల్పముగా యున్నవారలనే గదా దోచుకొనుట. వారినికాపాడుటకై ప్రజలను బీదలను మనము బాధించుటకా మనఆజ్ఞలు. ఒక్క భాగ్యవంతుని కాపాడ యేన్నోవేల ప్రజలకు బాధ్యత గల్పించుటా మనపని! ప్రజా దోపుడుగాండ్రను బట్టి పుర్రెలు దీయించిన యీదోపుడు గాండ్రు యుండరు. ప్రజా నిరుత్సాహముండదు. ఆలోచిం చండి. ప్రభుళ్ళ చిత్తము.

రాజు—అట్టి వాళ్ళను బట్టుట మహాకష్టముగదా.

2 మంత్రి—ప్రజలా మనకు లోకువ ప్రభూ! బీదలు లేకున్న భూమి ఫలించదు బురకాదాగుల బొర్రనిండదు.

1 మం—యేప్రభుత్వమైనను ప్రజలేగా నిలబెట్టుట కనుక నిదానించి ఆజ్ఞలివ్వవలయును ప్రభూ.

రాజు—కాదు ప్రభువేమిచేయును ప్రభునకు అందరు సమానులే మన తాబేదారులవల్లనే యింత అలజడికి కారణమేమో నిదా నించితిరా.

1 మం—అందులకే ఆలోచింపవలయును.

రాజ—సరే దేశము శాంతించిన చాలును దేశబాధలు చూచి మతి చలించుచున్నది.

2 మం—నిజమే శ్రీమంతులెన్ని కుతంత్రములు పన్నినను రాజ్యము నకు గాని ప్రజలకుగాని భంగములేకున్న మంచిదే స్వలాభ పరాయణులు యితరుల భ్రమింపజేసి దేశము హీనస్తితికి దెత్తురేమోయని దోచుచున్నది. ప్రభూ

రాజు—వెఱ్ఱివాడా తంత్రములు పన్ను యజమానుడెంత కాలము అగ్రస్థానము వహించును? ప్రజలసంఘమును విశ్వాసరాహిత్యము చేయనే జేతురుగదా

మం—మాలోపున ప్రభుత్వమును ప్రజలను అన్యాయము జేయనెంచిన యేమగునో

రాజు—అట్లుచేసిన వానిని గ్రహించి పూర్వము చోళచక్రవర్తిని జేసినవిధమేగదా

సేవ—ప్రభూ భీమకవి గారట వచ్చితిరి సెలవా.

రాజు—మంత్రీ కవిరాక్షసుడని పేరుగాంచిన ఉద్దండకవి యగు వేములవాడభీమకవి వచ్చినాడట అతనిమాట విన్న శరీరము గంపము జనించుచున్నది.

మం—ఎందులకీ కంపము ఆతని సగౌరవముగా సాగనంపిన మనలనేమి చేయును

రాజు—యిట్టిసమయమున గౌరవించుటకు డబ్బుచాలదు శిస్తులు, జమాబందులు తొందరగా యుండ కాలక్షేపనకు సమయమేది మంత్రి

మం—మరల రమ్మనవచ్చును గదా

రాజు—కోపించి శపియించడుగదా

మం—అంత విజ్ఞానములేనివాడా యీతడు యీతొందరులు కళ్ళార చూచునుగదా

రాజు—సరే ప్రవేశింపజేయుము

భీమ—ప్రవేశించును.

రాజు—కవిసార్వభౌమా! నమస్కారములు యీపీఠ మలంకరింపుడు.

భీమ—దీర్ఘాయుష్మాన్ భవతు. (అనికూర్చుండును)

రాజు—మంత్రీ జమాబందిపుస్తకములు దెప్పింపుము చూతును యేయేగ్రామములు ముందుగా చేయవలయునో

మం—చి త్తము కొన్ని గ్రామములు అనావృష్టిచేతను కొన్ని అతివృష్టి చేతను చెడిపోయెనని లేఖలు వచ్చినవి యివియే లేఖలు చిత్తగించుడు.

భీమ—ఏమిది ఈతడు నాకవిత్వమువిని ఆనందించు నను్నొన్న సావకాశము లేకుండ జేయుచున్నాడు రాజులు గర్వోన్మత్తులందు రిందులకే గాబోలు నేనే పల్కరింతునుగాక రాజా

రాజు—వెనుతిరిగి చూచి చిత్త మేమిశలవు.

భీమ—ఉ. వేములవాడయందు ఘన విశ్రుతకీర్తి జలంగ నందరన్
భీమకవీంద్రుడంచు నను పెద్దగ సన్నుతిజేయ సజ్జన
స్తోమము తెల్ల సంతసిల దుర్జనులెల్లను భీతినొందగా
బ్రేమను దక్షవాటిపుర భీమకవి పాపరిలబ్ధ తేజుడన్.
వింటిరామహారాజా

ఉ. చెప్పెదనింపుగా కవిత శ్రేష్టవచఃపరిగహ్యామానమై
యొప్పగ మంచిచెడ్డగను నోగును బాగగునట్లుగా మడిన్
గొప్పను కొద్దిగాదివచి కొద్దిపదార్థముగొప్పచేయనా
కెప్పుడు శక్తిగల్గు జగత్ ధవనానుదు లాలకింపుమా.

జగత్ ధవానా కవిత్వపోకడ లాలకించి నన్నానందింపజేతువని గంపెడాశతో వచ్చియుండ మాట్లాడుటకైనను సావకాశము లేకుండ జేయుట తనుకు భావ్యమా!

రాజు—కవీంద్రా! నూతనరాజ్యాంగసమస్యలు తారుమారుగా యున్న యిట్టిసమయంబున సావకాశమెక్కడిది? నిర్మలముగా ఉన్నప్పుడే పండితుల నాదరించుట, వినుట, సంతసించుట మీా రెరుంగని ధర్మములున్నవా!, కావున యిప్పటికి తమరు నాయందు దయయుంచి తొందరదీరిన వెనుకవచ్చిన విని ఆనందింతును, సత్కరింతును.

భీమ—రాజా ! నావాక్కు యొక్క మహాత్మ్య మెఱుంగుదువా.

రాజు—ఎఱుగ కేమి? మహానుభావులు అనన్య కవితా ధురీణులనియు నెఱుగుదు. కాని దేశము నానాసమస్యలతో అలజడిగా నున్నది. బొక్కసమున ధనముసున్న. ప్రజల కన్నము సున్న. రాజ్యకాంక్షాపరులకు రాజులకు నిర్మలము సున్న యన్నట్లు పరిస్థితులున్నవి కనుక యికనొక పర్యాయము దయచేయ ప్రార్థన.

భీమకవి—ఔరా ! యీ నృపాలున కెంత యాగడము? ఉద్దండ కవి బిరుదాంకితుడనగు కవిరాజునని యెదుట మాఱుపల్క నిర్వి క్రమ యశోమండనాయమానుండనగా? యెదుటనా మాయ మాటలు చిలువలో చెలగాటమా విగ్రహానుగ్రహుండనగు నేను నీదరికివచ్చుట చాలని తలంపక మరలరమ్మనుచుంటివా యాచకుడననుకొంటివా తులువా నీ మొగము చూచిన మహా పాతకము సంభవించును. నీవు సకలయాచక్రవర్తివనియు న్యాయాన్యాయవిమర్శనాకోవిదుడవనియు ఎంతో ఒలకపోసెద వనియు ద్వితీయవిఘ్నము గాకూడదని ఆశతో వచ్చి పల్క రించ మరల రమ్మంటివా! ఇంత హీనముగా జూతు వను కొనలేదు. చూడు రాజా నీరాజ్యమదాంధత్వము నావాంగ్మ దాంధత్వము యేది నిర్విఘ్నముగా జరుగునో చూతువుగాక.

ఉ. వేములవాడభీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామము బూన్కి యుద్ధమున సందడిజేయుచు రమ్ముపొమ్మనెన్
మోమును చూడ గూడదిక ముప్పదిరెండు దినంబు లావలన్
జామున కర్థమందితని సంపద శత్రులు పాలుగావుతన్.

రాజా! నీరాజ్యంబు ముప్పదిరెండు దినంబులావల అర్థ ఘామములో నీశత్రు హస్త గతంబగుగాక. రా, శఖముఖ శాస్త్రి. (అని జనును)

రాజు—(దుఃఖించుచు) ఎవ్వని గురించి భయోత్కంపిత గాత్రుండ నైతినో యేకవీంద్రునిగురించి మాటచెప్పిన మాత్రంబున శరీరము కంపము జనించునో యేకవినామాటలు విన్న ఊటిపోటు లయ్యెనో యేయుద్ధకవి నాయెదుటను వచ్చి నాసంగతి యెరుంగుదువా యని పల్కెనో యట్టివాడు ఎదురుగా లేకున్న బ్రతుకుదునని భయంబు చెందితినో అట్టివానిని మరల రమ్మనుటకు కారణముగానీ వేరుగాదు. భావము గ్రహింపక శపించిన యాకవీంద్రుని యేమనగలవాడను.

మంత్రి—మహారాజా! ఊరడిల్లు ఊరడిల్లుడు మీభయవ్యామోహమే యింతజేసినది. ముందు నేజెప్పితినిగదాపూర్వసత్కారము జేసిన మనకేమి భయమని అట్లుగాక మున్ముందే యాకవిని నిరుత్సాహపరచి పొమ్మన్న కోపమెందులకు రాదు యింతకూ కర్మఫలమెవ్వరు తప్పించగలరు. హీనులమాటలు చెవికెక్కినా మరల వానిని బ్రతిమాలిన వచ్చునా రాడు. ప్రాజ్ఞుండు ముందువెనుక లాలోచింపవలయును. గతమునకై వగవరాదు.

రాజు—మంత్రీ! నీవుచెప్పినది నిజమే. యాతనిని గౌరవించి పంపిన యింత విపరీతము లేకుండును. ఇప్పుడేమనుకొన్న ఏమున్నది? చేతులు కాలిన వెనుక ఆకులుబట్టు విధముగా నున్నది. మన యాలోచన?

2 మంత్రి—రాజకులావతంస గారడీవాని విద్యలు గ్రహించి ప్రజలను బాధించువారు పండితులా ప్రభూ?

1 మంత్రి—పొరపడితివి. ప్రపంచమే యడలుచున్నది. మనమా లెక్కలోనివారము! అతనిమాటలు వేదాక్షరములని నమ్మ వలసినదియే.

2 మంత్రి—అట్లైన మనమే చని, ప్రార్థింతము. ఇంతయెందులకు.

1 మంత్రి—మనమాటలు పాటించునా ? కోపము తీరును ! వట్టికల్ల. అనుభవింపవలసిన దే.

రాజు—నా వ్రాత ఇట్లుండ యెవ్వరి నేమన్న మనదియే తప్పు. కాగ లది కాకమానదు.

సేవ—జయము జయము మహారాజా! విక్రమదేవు సైన్యములు అక స్మాత్తుగా మనకోట ముట్టడించుచున్నవి. త్వరపడవలయును.

రాజు—(నివ్వెరపడి) మంత్రి! చమూపతులారా! యిదే మేమి న్యాయము. దేశము హీనస్థితియందుండెనని విచారించుచుండ జాలిలేక రాజ్యకాంక్ష అవిక్రమదేవు నెంతక్రూరునిగా జేయు చున్నది. అతడు మాత్రము భరతమాత బిడ్డడుగాదా యిట్టి అన్యోన్య కలహములు మనలో మనకేగల్గ ఆగర్భశత్రులగు మహమ్మదీయ హంతకుల పాలబడి ప్రజలు నానాకష్టము లనుభవించ చూచి యీరాజ్యతృష్ణ యెందులకో తెలియదు సరే కార్యముమించినది. త్వరపడుడు సర్వసైన్యముల నాయ త్తపరుచుడు. నే నిదే వచ్చుచున్నాను. అరే దురాత్మా విక్రమదేవా ! నీ యట్టివాని కా నేను లొంగునది అనేక పర్యాయములు పరాజయములునొంది అకస్మాత్తుగా వచ్చి దొంగవలె యుద్ధముచేయనెంచితివా! చూతువుగా. దుష్ట రాక్షస విరాముండగు రఘురాముడు రత్నాకరము బంధించు తెరంగున నిన్ను బంధించకున్న నేను కళింగగంగునే కాదు. జే భరతమాతకు జే (అని పరుగుపరుగున చని యుద్ధము జేసి అలసి పట్టుబడును. కారాగృహంబున నుంతురు.

(ఇతి రంగం)

[విక్రమదేవుడు—సామంతపాలురతో]

విక్ర—సిరియాళా యీ సెజ్జనగరము పట్టుటకు అనేకపర్యాయములు ప్రయత్నించితిని గాని నాకోర్కె నెరవేరలేదు. అందు లకై యిప్పుడు నలువదివేల కాల్బలము, మున్నూరేనుంగులు, నలుమన్నూట తొంబదియైదు గుఱ్ఱములు నాల్గువందల శత ఘ్నులు గూర్చుకొని అకస్మాత్తుగా కోటముట్టడించి రాజును పట్టితిమి. గాని యీరాజ్యము మనకు స్వాధీనమగునా.

సిరి—దేవా! అంత పరాక్రమవంతుడా కళింగరాజు!

విక్ర—పరాక్రమవంతుడేగాదు. ధాత నవమన్మధుడు ప్రజారంజకుడు రాజతంత్ర విశారదుడు, భూతదయాపరుడు, శౌర్యమూర్తి గాని యీకళింగరాజ్యము సర్వసంపన్న సమృద్ధిదంబని ఆశచే ప్రయత్నించి ప్రయత్నించి లేని విరోధము గల్పించి మాయో పాయముగా బట్టవలసి వచ్చినది. అందులకే కొద్ది సైన్యము ప్రత్యూతమున్నను ముప్పదిరెండు దినంబులుపోరవలసివచ్చినది.

సిరి—తమరీ యుద్ధమున బహుపరాక్రమము జూపితిరి.

మంత్రి—తమరు స్వయముగా యుద్ధతంత్రము నడుపకున్న అల్పజ్ఞుల మగు మేమేమి చేయగలము ప్రభూ!

సైన్యాధిపతి—యీ సంగ్రామము మనమహారాజు యుద్ధనైపుణ్య ముగాని వేరుగాదు.

విక్ర—సరిసరి మీయందరి భుజబలమే దీనికంతకు కారణము.

సిరి—రాజానుమతీధర్మం. తమవాచామత్యధైర్యమే యీవిజయము.

విక్ర—సిరియాళా రాజకళింగగంగు మహారాజు భార్యలకు నూరు గద్యాణములు నెలకు ఒక్కొక్కరికి మనవర్తి యిచ్చుచు తల యొకమేడలో నుంచుడు.

సిరి—మహారాజని సంభోదించితిరి మీరు మహారాజులుగారా.

విక్ర—ఎన్ని జెప్పినను మహారాజ శబ్దమాతనికే జెల్లును. నాకు రాజ శబ్దము చెల్లునుగాని మహారాజశబ్దము చెల్లదు యెందులకన తనరాజ్యము సర్వసస్యకోమలముగా జేసెను. ప్రజానురంజకుడు, దేశోద్ధారకుడు, మనమో నిజమునకు రాజ్యకాంక్షా తత్పరులము గాకున్న లక్ష్మితో తులతూగురాజ్యమున కాసింతుమా.

మంత్రి—ప్రభూ! అట్టి మహారాజును కారాగారమున నుంచు టేల.

విక్ర—అమ్మయ్యో ఆతని విడచిన మనమిచ్చట అడుగిడుటకైనను తావు లేదు.

సైన్యా—కారణము సెలవిత్తురా.

విక్ర—ప్రజలే యాతడు. ఆతడే ప్రజలు. కళింగగంగు కంటబడిన చాలును ప్రజలందరేకమై మనప్రభుత్వమును కూలద్రోతురు.

సిరి—అట్టి భయోత్కంపిత రాజ్యము నేలుట కష్టముగదా!

విక్ర—మనమైనను యీరాజ్యము కొంతకాలమే యేలుట. యేమన యీలక్ష్మి పూర్తిగా మనరాజ్యమునకు తరలించువరకే యింత ఆర్భాటము వింటివా.

సిరి—చిత్తము.

విక్ర—సిరియాళా! మనరాజ్యమున బాలుడగు నాకుమారుని నిలిపి మంత్రులుపాలింప నియమించితిని. త్వరగా వెళ్ళవలయును. యీసెజ్జనగరము నాకుమారుగా పాలించి నాకు కప్పముగట్టి జాగ్రత్తగా యుండుము. సర్వసైన్యములతో వెడలుచుంటిని జాగ్రత్త పొరపాటొనర్చిన శిక్షింపబడుదువుసుమా.

సిరి—చిత్తము. తమఆజ్ఞ సుగ్రీవాజ్ఞగా పరిపాలింతు ప్రభూ! నమస్కారము.

విక్ర—కళింగరాజును కారాగారమందుంచితిమిగదా తప్పించుకొన్న ప్రమాదము జాగ్రత్తగా కాపాడుము. తప్పించుకొన్న నీప్రాణీడ యుండదు.

సిరి—చిత్తము. తమయాజ్ఞ.

విక్ర—యిదిగో కత్తి. నిన్ను సామంతరాజ్య పట్టాభిషేక మొనర్చితి. ప్రజలారా! యింతటినుంచి యీ సిరియాళ దండనాథుడే నాకు మారుగా ప్రభువు. యీతని మాటలు ప్రజలు, మంత్రి, సామంతులు విశ్వసింతురుగాక! యిది నాయాజ్ఞ.

(జయ జయ ధ్వానములతో సభముగియును)

రంగం

[కారాగారమున సంకెలలతో రాజకళింగగంగు విచారించుచు]

పాట

1. మానవేశ్చ నరవేరదు యెన్నడు మాధవేశ్చగాని ॥మా॥
2. మనమున కోర్కెలు గల్గుటగాని మాయమగును క్షణక్షణ మున యూహలు ॥మా॥
3. సురతములెన్నడు నిరతములగునా దురితము లడచి నన్ గావుము రంగా ॥మా॥
4. కనికరమున నను గావుము రంగా కష్టములను కడతేర్చి బ్రోవుమా ॥మా॥

వినయమునను నినువేడితి కావగ వేదవేద్య కావేటిరంగ శ్రీ॥

శ్రీహరీ! కంకణహస్త కృపాణ సమోపేతమగు యీచేతులకా కరచరణ నిగళబంధనము. చారుమాణిక్య సింహాసనా కన్య

కాకరగ్రహణ వింజామరా వీవనావినోదికా కారాగార వేదికా మశకవీవనా వినోదము. నానావిధక్షీరమధుపాన శాల్యన్న పతునికా, అంబలి యోగిరము సర్వేశ్వరా.

ఉ. చీమలు నల్లులున్ మశక జీవనసంతతి బాధచేత నా
కోమలమైన యీతనువు గూల్చక, నెందుల కుంచనెంచితో
ధీమహితాత్మ దేహి యని దీనత ప్రార్థన జేతు కేశవా
కామునిగన్నతండ్రి నను గారియబెట్టగ చాలున్యాయమే.

జీమూతసముద్రశంబగు యీచీకటికొట్టునందునికి దలంచుకొన్న గుండెలవియుచున్నవి. సర్వేశ్వర సంకల్పమమోఘము. అణువును మేరువుగాను, మేరువు అణువుగా జేయగల కాలమూర్తివి. నీకంటికి నేనే బరువుగా దోచితిని గాబోలు. (నిదానించి) ఛీ! దుష్టుడా! విక్రమదేవా అకస్మాత్తుగావచ్చి మాయయుద్ధమొనర్చితివిగాని లేకున్న దుష్టరాక్షస విరాముండగు రఘురాముడు ఖరాసురుల ఖండించు విధంబున కడ తేర్చక పోతునా యింతకూ మీకు మంచిదినములు వచ్చినవి. నాదినంబులు మంచివికాకుండుటచే ఆమహాకవికి నాపై నాగ్రహము జనించుట, మీరు ఆనందించుట, నేనీకారాగారంబున గ్రుమ్గుట సంభవించినది. యిప్పుడేమనుకొన్న నేమున్నది. చేతులు కాలినవెనుక నాకులు బట్టునట్లైనది.

మ. ధనమూ పోయెను బంధులాప్త సఖులా దాయాదులన్ దూరమై
ఘనమౌ రాజ్యము పోయి యివ్విధముగా కారాగార బద్ధుండనై
నరనాధుండిక నెన్నినాళ్ళిటుల నాయన్నవారేరి నా
మనమూ యూరట గల్గజాలదిక నే మాన్యుండు గాపాడునో.

మంత్రీ—(ప్రవేశము) మామహారాజును కారాగారబద్ధుని జేసి విక్రమదేవుడు సిరియాళునకు వప్పగించి పూర్వమంత్రులమైన మమ్ములను మంత్రులుగా నియమించి పాలించుచున్నాడు. యీతని రాజ్యపాలనము దేశక్షేమముగాదు. కేవలము తత్వజ్ఞానమేగాని వ్యవహారములంతగా చూచుటయేలేదు. ప్రజలయందు విశ్వాసముగూడ తప్పుచున్నది. మామహారాజు కారాగారమందుండ మాకును ప్రజలకును మనస్సులు కలచివేయుచున్నవి. ఏమిచేతును సేవకావృత్తి బహుబాధలతో గూడియుండును. సరే మామహారాజును కారాగారమందుండి తప్పింతునుగాక (అనుకొని కారాగారపు తలుపుదీసి) మహారాజా త్వరపడుడు. త్వరపడుడు. ఎవ్వరైన చూచిన ప్రమాదము వాటిల్లును. రండురండు.

కళింగ—ఎవ్వరది సుగుణసాగరుడా ఎంత సాహసము. శత్రువులమధ్య నుండి నన్ను దప్పింప వచ్చితివా. నీవిశ్వాసమునకు సంతసించితిని. ఎట్లు నన్ను సాహసాలు తప్పించుకొని వచ్చితివి.

మంత్రి—మహారాజ! ఆకారణము చాలగాయున్నది. ఇప్పుడు అప్రమేయమేల మీరు యీకారాగార విముక్తినొందిన పైన దైవమున్నాడు. పొండిపొండి!

కళింగ—సానుదయముగా చూచి రహస్యముగాతప్పించుకొనిజనును.

(ఇతిరంగం)

సిరియా—మంత్రీ! సకలపాప భూయిష్టంబగు రాజ్యమేలుట కన్న వనంబున తప మాచరించుట సుకకరంబు రాజనిన వాడు కరచరణబద్ధుడు న్యాయాన్యాయములు సాక్షివాఙ్మూలమున శిక్ష విధింపవలయును న్యాయమైన సరియే లేకున్న జెప్పవల

యునా (రాజారాష్ట్రకృతంపాపం) అని గదా స్మృతివచనము. మహాభోగి త్యాగి ప్రజారంజకుడైన రాజును కారాగారబద్ధుని జేసి నది లోభబుద్ధిగాని వేరుగాదు. రాజ్యకాంక్ష అంతరించినది. యెంతకాల మీభోగములు. పరసౌఖ్యముకై పాటుబడుట యెప్పుడు యీ శరీర మెంతకాలము శాశ్వితముగా యుండును. ఐహికవాంచలు శాశ్వితమా! కాదు. కావున నేను తపోవనమునకు జనవలెనని కోర్కెగల్గుచున్నది. మీరలు యీ మహారాజు రాజ్యమును కాపాడుకొంటూ విక్రమదేవునకు సహాదోడు వాదోడుగా నుండ నాప్రార్థన ప్రభూ! సెలవిత్తురా?

మంత్రి—సిరియాళ దండపాణీ! నీవైరాగ్యము వర్ణనాతీతము. మహామహులగు ఋషులెద్ది గోరుదురో దానికొరకాసించుచుంటివి. ధన్యుడవు. యివిక్రమ దేవు మహారాజుగా రేలకో ఆలోచించు చుండిరి.

విక్రమ—మంత్రీ! జన్మమన్న మన సిరియాళదండనాధునిదే జన్మ. తనువు లశాశ్వితమని ఇహసౌఖ్యముల కాసించక తపోవనమునకు వెళ్ళదలచి నాడుమహాత్ము డవజెల్లును.

సిరియా—మహారాజ! యింతకాలము తమ యుప్పు పులుసుదిని పెరిగి యీదేహముతో తపోవనమున జన సాహాసించితిని సెలవా.

విక్రమ—సిరియాళా నాచేపోషింపబడి పెరిగి పెద్దవాడవై నాకు చేదోడుగా సంచరించి వార్ధిఖ్యదశలో విశ్రాంతికొరకు తపోవనమున కరుగుట మహాసంతోషదాయకము నీయిష్టము వచ్చునట్లు సంచరించ యిదే ఆజ్ఞాపత్రము.

సిరియా——ప్రభూ! సెలవు వందనములు. (అనిచనును)

విక్రమ——(మంచిది.)

సిరియా——మంత్రులారా! ప్రజలారా! సెలవు.

ఇతి చతుర్థాంకము సమాప్తము.



# శ్రీ భీమేశ్వర మహాత్మ్యము

## పంచమాంకము

### ప్రథమరంగము

(బికారి వేషముతో రాజకళింగగంగు మహారణ్యమధ్య జనుచు)

ఇప్పటికి కారాగార విముక్తిఁ బొంది రహస్యముగా నిర్ధనారణ్య ప్రదేశమున జేరితిని ఆహా చతుస్సముద్ర ముద్రిత ధరాచక్రంబేలు భూరేడు కారాగారబద్ధుడై దొంగవలె తప్పించుకొని యిప్పటికి ఒంటరినై బికారినై శత్రువులకు జంకి రహస్యముగా సంచరించవలసిన గతి దాపురించెను గదా ఎట్టిగతులు గల్పించితివి. శ్రీహరీ.

సీ. యేదారిలేని నాకేదారి గల్గునో
 దెలియకున్నది ముందు గల్గుదారి
యీదారిపోదునా నాదారిపోదునా
 నాధారగమ్యమా అరయదారి
యేదారిజూపవా నీదారియంటివా
 కరుణించ రావేర ఘన మురారి
జీసత్కృపాకారి కోదండఘునధారి
 కాచి రక్షించరా కరాసురారి

గీ. ధీర మనసము నిజనోద్ధీర శౌరి
భక్తజన హృద్య పాహిమాం పాహియంచు
గోరుచుంటిని కాపాడ కూర్మిజూడ
భిన్నములు భిన్నములుగాగ భక్తపాల.

అదుగో అచ్చో గన్పట్టు పర్వతములాకారంబుగా అనన్యసాధారణ దీర్ఘ శాఖా పరిశోభితంబులకు వటాదివృక్షంబులు శాఖాకరంబులుగా కటికిచీకట్లు శరీరవర్ణముగా ఎఱ్ఱనిపూల గుత్తులు కన్నులుగా పొదలంబొదలుకంటక సంతానము నిక్కబొడచిన కురులుగా పాములబుస విశ్వాస విశ్వాసములుగా చెట్లు మధ్యనుండెడి సందులు తెరచిన తలవాకలిగా ఘోర మృగములు దని విడచినయెముకల ప్రోవులు కరాళదంష్ట్రము లుగా మన్ను మిన్నేకమగునట్లు గర్జించు క్రూరమృగ ధ్వనులు ఝూంకారంబులుగా నొప్పుచున్న యీయటవీ రాక్షసుడు మ్రింగునా యన్నట్లు మహారణ్యమొప్పుచున్నది. ఆహా వడలుజలదరించుచున్నది.

ఉ. సాగెనుసర్వరాజ్య రమ శత్రుల హస్తగతంబునొందనే
సాగితి కాననాంతరము శరభ మృగాగిరి రాజ్య సీమలన్
జోగిని యైతి నిప్పటికి జూచెడివారలు లేరు నెవ్వరున్

• సాగియుర్వాదు యెల్లపుడు సర్వము యొక్క విధంబు అక్కటా హాపరమేశ్వరా ఎంతలో యింత జేసితివి సకలరాజ్యన్య పరివేష్టితమై దాసదాసీజనులతో నూడిగము చేయించు కొను నాకీ గహనాంతరవాసమా సకల మహీస్తలం బేక చక్రాదిపత్యంబున నేలు భూనేతగా యీఅరణ్యవాస పరిపాలనము చలువ రాసౌధముల నెక్కుమహారాజునకా శైలశిఖరారోహణము నానాతరుగుల్మపుష్పలతా పుజంబులగు ఉద్యానవన పుష్పవాసనా వికాసికాయీఘోర కాంతర విహారము నానాజన సంకులంబగు రాజ్యంబేలు మహారాజునకా యీక్రూరమృగసంకులంబగు నటవీప్రదేశంబా యేలుబడికలుట.

మ. జననం బందితి రాట్కులంబునను నీసర్వావనీనాథులున్
గనలేదిట్టి వదాన్యుఁడీతడనుచున్ గారాబంబునన్ మెచ్చ
అనయంబున్ ఘనసౌఖ్య మునుగనె హా నక్కటా నిప్పుడో
పెనుభూతాకృతి దాల్చు కాఱుటడవిన్ భీతిల్లితే నొంటిగా.

అదుగో యీకష్టసమయమున నీవి ట్లీల యేడ్చెదవని గాబోలు నక్కలొగిమొగి మిక్కుటముగా గూయజొచ్చినవి.

మ. చతురంభోదిపరీతభూవలయున్ సంతోషితస్వాంతుడై
అతులంబౌఘనసింహపీఠమున నానారాజ మేల్బంతియై
రతనాలంకృత భూషణుండివుడహా రాజ్యంబుపోనాడి యీ
గతి మాలిన్యశరీరినై యనదనై కాంతారమందుం డెహో.

దేవాదిదేవా దయలేకపోయెను మహాత్మ

ఉ. జీవితసార్వభౌమ నను కోపముతో ని౹ు చేయబాడియే
రాక నిరాకరించితి నె రాజ్యమదంబని నూహ నెంచితే
వేకను గౌరవంబిడగ లేదని శాపము నిచ్చి తంటివా
లోక మెఱుంగదే వినవె యోకవిరాజ యెఱుంగవే మదిన్.

భీమకవిచంద్రా సకలదిగంతఖ్యాత మండనాయమానుండగు భూ రేదు నెంతపనిజేసితివి తండ్రి అదుగో (అని) సమీపమున నేదో యూరగపడుచున్నది ఆదిక్కునకు జని క్షుదార్తుండనగు నేను భిక్షమడిగెదగాక హరిహరి నిర్విక్రమపరాక్రమోపేతుండగు నాకీ నాటికి భిక్షుకవృత్తి గల్పించితివా ప్రభూ నాయం దెంత కఠినము వహించితివి స్వామీ.

ఉ. వేదనచెందె నామనము యెవ్విధి చూచిన దిక్కుసున్న నా
బాధను తీర్చువారెవరు బాయునిదుఃఖసముద్రమీదగా
సాధన మేది నాకికను సద్గుణశీల రమామనోహరా
మాధవ నావవీవుముని మానసచిత్తహరాయ గావఁరా.

యెట్టి కఠినమనస్కులకైనను భ్రాంతజాలియుండకపోదు. నీమన మట్టిదిగాదు.

సీ. నిరతంబు నినునమ్మి నెనయు విప్రునకును
నివ్వరి ధాన్యంబు నిత్యభుక్తి
నిరతంబు నినునమ్మి నెనయు పాపురేని
నెమ్మి యగా పవనమే నిత్యభుక్తి
నిరతంబు నినునమ్మి నెనయు పాండవులకు
యిల కందఫలములా నిత్యభుక్తి
నిరతంబు నినునమ్మి నెనయు భక్తాళికి
నిత్యోపవాసమా నిత్యభుక్తి

గీ. దేవ నిను నమ్మువారికే తెరవులేదు
నన్ను గావగ నెంతువా నళిననయన
గాచినను కావకున్నను కఠినమైన
దైత్యకీవు వృత్తినిడితివే బాగుబాగు.

అపరాధిని పిపీలకాది యెనుబదినాల్గులక్షల జీవరాసుల సమంబుగ జూచు మహామహుండవు. నాకర్మకు నీవేమి చేతువు. మహాత్మా! నిన్ననిననిందావాక్యములకు నాదియే తప్పు. నాకు కష్టము గల్గ భరించజాలక తూలనాడితిని. స్వామీ! క్షమించు. క్షమించవా రావా! కావవా కరుణించవా త్రోవజూపవా యూరు సమీపించినది. భిక్షమడిగెద గాక, (అని పరుగుపరుగున జని యూరు కాకుండుట నివ్వెరపడి వగచి) హారహారా! యెట్టి ఆశలు గల్పించి నిరాశ గల్పించితివి. ఆహా! నాబ్రతుకు.

ఉ. ఏలగ రాజ్యమా చెడె భుజింపగ భోజ్యము సున్న పండగా
జాలదు మంచమా అరదు సాపడినుండ గృహాంబుళక్కి నా
మేలగు వాజి భూజ్య మహో మించినచేలములైన కర్వ యే
లీల జరింతు నన్న యిక లేదు సుఖంబు దరిద్రమేగదా.

ఎట్టిహీనస్థితివాటిల్లె సరేశ్వరా! పరంధామా! కృపాళో! దయరాదా! ఏమనుకొన్న నేమున్నది? అదుగో! యూరు. అది నిజము జనపదమువలె అగపడుచున్నది. అన్నాతురుండు అడుగుకొనుటగాకున్న గతులే మున్నవి. అదుగో. (అని చని పాడుకొంటూ)

పాట.

1. దీనుని బాధలు దీర్చండీ యీ నిరుపేదను కరుణించండీ ॥దీ॥
2. దీనదయాపరులండీ మీ మేలును దలచెదనండీ ॥దీ॥
3. అన్నలు అక్కలు చూడండీ నా ఆకలిమంటను బాపండీ ॥దీ॥
4. విన్నవించెదను యొక్కనిగాచుట వెలతి గలుగబోదండీ ॥దీ॥
5. నావలె నికయెందరో నమ్మిక చెడితిరి గాంచండీ ॥దీ॥
6. నీవనేను యనుభావము వీడియు, మానవసేయు జేయండీ ॥దీ॥
7. జీవుడొక్కడే సర్వభూతముల శ్రేష్టుడు శ్రీహరి నమ్మండీ
8. భావమందునా దలచండీ కడసారి జన్మ యికరాదండీ. ॥దీ॥

అమ్మా భవతు భిక్షాం దేహి.

1 గృహిణి—అబ్బీ యింట తండులములు నిండుకొన్నవి వెళ్ళుము
రాజు—పోనీ తల్లీ యిక నొక యింటికడ యాచింతును (అని చని)
అమ్మా ఘూంఘూకరము తల్లీ నూధవకవళము.
2 గృహిణి—అయ్యా మావారు తాళపుచెవులు మొలగట్టుకొని వెళ్ళిరి, వంటచేయ లేదింతవరకు,

రాజు—అమ్మా ఆకలితల్లీ అన్నము కడుపుమాడి పోవుచున్నది ఒక్క కవళమెయ్యి తల్లీ.

3 గృహిణి—ఆ దుక్కలాగున యున్నావు పని జేసికోరాదా? కుంటివా గ్రుడ్డివా ?

రాజు—అమ్మా కోపమేలనమ్మా కడుపుమాడుచున్నది జయ యున్న బొట్టుము లేకున్న పోదును తల్లీ.

3 గృహిణి—కాకపోతే యీ వేషాలేమిటి యిదేమి పోగాలము యిది మాత్రము సులువుగావుంది దాచబెట్టినట్లు పదపద.

రాజు—కోపమేలతల్లీ నాఖర్మమిట్లుండ నా కీయాపద తటస్థించినది.

3 గృహిణి— అబ్బో శ్రీరంగనీతులు అడుక్కు తినేవాళ్ళకు కర్మమేమిటి పొద్దస్తమానూ ఆయింట ఆయింట అడుక్కొని మాపులుకన్నా లేస్తారు నీయట్టివాళ్ళ నడునడు నీశార్థం.

రాజు—అమ్మా దరిద్రులను చూచిన అందరికీ నీచమే తల్లీ భాగ్యవంతులు బలయుట దరిద్రుల రక్తముపీల్చుట పూర్వము నేనును యివ్విధమూ సంచరించితినేమో యిప్పుడే యవస్త దాపురించుటకు కారణము అమ్మా భిక్షాం దేహి.

4 గృహిణి—అయ్యో పాపము యెన్నిదినముల నుండి తిండిలేదో నాయనా నీరసముగా అగుపడుచుంటివి. యేమిచేయను నాకే యొకపూటలేదు యిక్కడ యాచించినను వేయువారు లేరు పాపపు ద్రవ్యముగలచోట పెద్దమ్మ నాట్యమాడునే యన్నట్లు తలుపులు గెడవేసి యుంటురు పల్కరు తలుపు దీయరు నీయాకలి తీరదు. వారు తినరు నాయనాఅబ్బీ నాకన్న కూస్త యున్నవాళ్ళ యింటికి జనుము కడుపునిండును శ్రీమంతులకు ఆకలుండదు అజీర్ణబాధచే వారి కాకలియుండదు యెదుటి ఆకలి తెలియదు రా అబ్బీ వారు తినరు యొరులకు బెట్టరు.

రాజు—అమ్మా సర్వేశ్వర కృప యేమి చేతును శివ శివా ఎట్టి హీనస్థితి అనుభవింప జేయుచుంటివి శ్రీహరీ నాదరిద్రమునకు తెరపిలేదా పరాత్పరా.

సీ. నిరతము నెనలేని సిరిసంపదల్ నొంద
నన్నంబు కరువాయె ననఘు యిప్పుడు
సింహాసనాశీనుడై యొప్పెడి యాశ్రితభోజ
కన్నంబుకరువాయె ననఘుయిపుడు
ఉద్యాన వనులందు యువిదతో జనునాకు
నన్నంబు కరువాయె అనఘుయిపుడు
మంత్రి సామంతులు మన్నన గొనుజేని
కన్నంబు కరువాయె ననఘుయిపుడు
గీ. కవిత సాహిత్య గాన కళాపరతుల
వినుచునుండెడి నాకిపు డెన్నగాను
పట్టెడన్నంబు కరువుతో పండవలసె
కాచి రక్షించి బ్రోవవే గరళకంఠ.

యెట్టి గతులుగల్గెను నేయింట పట్టెడన్నము బెట్టుదురా యని తిరుగుచుండ నొక్క యిల్లాలి చేతనైన నిప్పుడు మెతుకులు బెట్టింపలేక పోతివే మహాత్మా. నాలుక తడబడు చున్నది కడుపు మాడుచున్నది యేది గతియో తెలియకు న్నది అదుగో యీకష్ట సమయమున నీ విల్లేడ్చెదవని గాబోలు వర్ష ధారలు మిక్కుటముగా లెక్కరించుచున్నవి యీదరిద్రమునకు తోడు యీయురుములు మెరుములు చీకటి భూతములాగున యీకారుమబ్బులు గనుగొన త్వరిత గతి జనెదగాక.

రంగము—భీమకవి.

ఆహా! ఏమిది! ప్రళయకాలం బోయన కారుమబ్బులు మహా నందము గొలుపుచున్నది. యెంత చిత్ర మెంతచిత్రము.

సీ. గగనకాంతయు లేదు గౌరవంబున నేడు
        సొప్పుగా దాల్చిన కొప్పనంగ
గగనచుంబితమైన ఘన వృక్షశాఖల
        పట్టియుంచెడి తేనె పట్టులనగ
యింపుతోడుత శిరమెత్తి జూచిన
        రేరాజు మధ్యమ రేఖయనగ
వనమధ్యమున నున్న వటజంబులను నెంచి
        పరికింప నేరేడు ఫలము లనగ

గీ. దోచె వారిదములు నెన్న దొంతరులుగ
ప్రబలి గగనంబునంతయు గట్టి క్రమ్మగ
నాకమున కేగుచుండెనో గాక దీని
సొగసుగాంచిన నామది సోద్యమయ్యె.

యిట్టి భయానకంబగు చీకటి భూతమును గన యెవ్వరి మనంబు ఝల్లుమనదు యీ మేఘములకు తోడు విద్యులత తోడి మెరుపులయందము చూడ నొకవిధమైన ఆనందము గొల్పుచున్నది. అదుగో తపంరులుగూడ పడుచున్నది.

రాజు—అయ్యో! యీదరిద్రమునకు తోడు నీవిట్లేల యేడ్చెద వని కాబోలు. యురుములెల్లడ కర్ణరంధ్రములు బ్రద్దలగునట్లు ధ్వనించు చున్నవి. వీటికి తోడు నీనయనధార లిట్లేగాబోలు వర్షధారలు సూదులవలె పైబడుచున్నవి. ప్రకృతిగూడ నన్ను పహాసించుచున్నట్లగపడుచున్నది. పరుగిడెదగాక. (అని పరుగిడి పాతరగోతిలోపడి లేవబోయిపడి) హా! శ్రీహరీ!

గీ. యెంతయాచకుఁడైనను యిలనుకాలు
దివిటియుండగవలెనంచు దెలసెనిపుడు
కుందనవు పళ్ళెరముకైన గోడదాపు
కావలెనటన్న సూక్తిగా కర్రలేదు.

అమ్మా! చేతకర్రయైన లేకుండెనుగదా. దండమేయున్న నామోకాలు పెచ్చులూడు నాసమయమునకు కర్రజారి యీ చీకటిలో కలసిపోయినది. హా! దైవమా!

భీమ—ఏమిది? యెంతయాచకుడనుచున్నవాడు వీడెవడు యాచకుడే గదా. వేరొకయాచకుని సంబోధించుచున్నాడు. యీచీకటి భూతంబగు కారుమేఘములవల్ల వానిస్వరూపమే అగుపించక కున్నది. వీడెవడో మహాసుఖమనుభవించి పాపముపడ రాని కష్టములుగుందుచున్నట్లు తోచుచున్నది. యిది నిజము. లేకున్న యాచకుడిట్లి పల్కులా. యెవ్వడవురా నీవు యీావర్షంబున దడియుచువచ్చుచుంటివి. యేగృహంబుననైన జేరకదడియుచు వచ్చుచున్నావు.

రాజు—అయ్యా నాజన్మ అడవిగాచిన వెన్నెలవలె నిరర్థకము మహాత్మా!

సీ. యేమహానీయునియిల కీర్తిచంద్రికల్
వ్యాపించి ఘనముగా వరలువాడొ
యే వాక్పటుత్వముగన్న కవిసార్వభౌములు
పాడలెత్తియుందురో యట్టివాడు
వరయుతుండని ప్రజల్ వర్ధిల్లి పుడమిపై
గౌరవంబగు పేరు గన్నవాడొ
భూషింప దూషింప భోగిభూషణునట్లు
దివ్యప్రభావంబు దెరలువాడొ

గీ. అట్టి మహనీయమూర్తి సంపత్ప్రపూర్తి
సంతతానందమూర్తి సద్గుణ చక్రవర్తి
ఘనుడు వేములవాడ భీమనకవీంద్రు
జేసెనయ్యొ ఫకీరుగా జెప్పుదేమి.

బాబూ వేములవాడ భీమకవి జేసిన పకీరుపక్షిని మహాత్మా మాధవకవళంబాబు. ఆకలి మూడురోజులనుంచి కటికోపవాసము. తల్లి అన్నము, అమ్మా కడుపుమంట గుప్పెడు మెతుకులు బెట్టి తల్లీ, తండ్రులారా, బాబయ్యా అన్నము పెట్టి పుణ్యము గట్టుకోండి అమ్మా అన్నము ఆకలి.

భీమ—ఎవరు నాచే శాపోపహతుండగు కళింగగంగా హరిహరి ఎంత దారుణము, ఈరాజు గౌరవించ లేదని శపించితినా యిట్టి అవస్తగల్గించితినా ఎంత నీచపుపనిచేసితిని. యిట్టి మహావస్త గల్గించినను నానాఅవస్తలు పడుచుండియుగూడ తూలనాడక సగౌరవముగా భీమకవి జేసిన పకీరుపక్షి ననుచున్నాడే యీ మహనీయుని యిట్లు జేసితినని ప్రజలేమనుచున్నారో ఏమనుట కేమున్నది యింతకఠినుడు లేడనుచుందురు. ఆహాసర్వేశ్వరా.

సీ. నీకారణంబున నెసగు గర్వముతోడ
బాణాసురుడు భంగపడెనుగాదె
నీకారణంబున నెసగు గర్వముతోడ
కామధేనువు బట్టె కార్తవీర్యు
నీకారణంబున నెసగు గర్వముతోడ
బాధబెట్టడె నిన్ను భస్మాసురుండు
నీకారణంబున నెసగు గర్వముతోడ
రావణుం డేపాటి రభసనొందె

గీ. అట్టి ఘనులగు వారలే యవనియందు
నిన్ను గొల్చియు దరిగాన నెంచరైరి
వారలకు మేటివాడనా వక్రమతిని
యీశ సర్వేశ జగదీశ ! గిరిధరేశ.

అట్టి నిర్విక్రమోపేతులగు మహానుభావులే నీవరగర్వమున శాంతచిత్తము లేనప్పుడు కించిత్ జ్ఞుడనగు నేనెంతవాడను మహాత్మా! భీమనాయకా! యీభూతేలి నన్యాయముగా శపించితి. ఇప్పుడు శాపవిముక్తి జేయకున్న నాకు మహాపాపము సంభవించును. (ప్రకాశముగా) రాజ కళింగగంగూ! రమ్మా అన్నము పెట్టించెద.

రాజు—అన్నాతురునకు అన్నముబెట్టెదనన్న పేదకు పెన్నిధివిధంబున సంతసించుచుంటిని తండ్రీ, బాబూ యిదేవచ్చుచున్నాను. యిట్టి చల్లనిపల్కు యింతక్రితమే తండ్రితల్లిగాని పల్కలేదు దేవా (నిదానించి) కళింగగంగూ యని బిలచిన వీరెవ్వరో గదా, ఆనాడు శాపమిచ్చిన భీమకవీంద్రులు కారుగదా ఆ అదేనిజము. లేకున్న యీదరిద్రచూడామణి పేరెవరికి దెలియును. ఎవరికి గావలయును. తప్పక ఆమహామహుడే (అని తొందరగా జని) ఓమహానుభావ భాస్కరయశశ్చంద్రమా భీమకవీంద్రచంద్రమా.

కావుము గావుమయ్యా నను కష్టములన్ భరియింపజాలనో
దేవమహానుభావకవి దేవదయామయ దీనరక్షకా
తావకదర్శనంబునను ధన్యుడనైతి తరింతు నీప్రభా
పావనసత్కృపారసము ప్రార్థనజేతుగదయ్యా చూపగా.

కవిసార్వభౌమా! రక్షించుము. (అని కాళ్ళపై బడును)

భీమ—రాజా లెమ్ము లెమ్ము. నీవాక్యములువిన్నదాది విచారమున శరీరము కంపము జనించుచున్నది. విచారమడుగుము సకలై శ్వర్యములు నొందెదవుగాక. (అని లేవనెత్తి విచారించుచుండ)

రాజు—తండ్రీ యీదీనుని రక్షింపరా, క్షమించరా, అజ్ఞానవశంబున తెలియక మీకుజడసి మీరగుపించకుండ నుండవలెనని అగు పించిన శపింతురేమో యని జడిసి నేనావిధంబున నుంటిని ఫలమనుభవించుచుంటిని గాపాడప్రార్థించుచుంటిని మహాత్మా!

భీమ—రాజా నిన్నీవిధమున జేసినందులకు విచారించుచుంటిని. పునః పట్టాభిషిక్తుడవగునట్లు వరంబొసగ దలచితిని. చింతించకు. వడ్డనయైనది భోజనము చేయుము. నేనొకపద్యమిచ్చెదను దాన నీకు శుభముఁలొనగూడును.

రాజు—దేవా ఇప్పటికి తమవాక్యామృదుధారలచే తృప్తిగలిగినది. నాయాకలి తీరినది. తండ్రీ! (అని భోజనముచేసివచ్చి నిలచును)

భీమ—రాజా వచ్చితివా వినుము.

ఉ. వేయిగజంబులుండ పదివేలతురంగములుండ నాజిలో
రాయలు గెల్చి సజ్జనగరంబున బట్టముగట్టుకోవఁడే
రాయలకళింగగంగు కవిరాజభయంకరమూర్తి చూడగా
బోయిన మీనమాసమున పున్నమపోయిన షష్టినాటికిన్.

రాజా సకలైశ్వర్యములతో ఫాల్గుణమాసమున పున్నము వెళ్ళిన షష్టినాటికి నీరాజ్యము నీకువచ్చును పొమ్ము. అప్పుడు నీ ఆస్థానమున నన్ను జూతువుగాక, కాలయాపన జేయకుము పొమ్ము.

రాజు—సాష్టాంగముగాపడి దేవా! నిర్హేతుకజాయమానకటాక్షముచే.

శా. సంపాదించితి నేడు రాజ్యరమమిా స్వశ్ఛంద వాఖ్యావలిన్
సంపాదించి బాధనొంది సరులా చక్రిం గొల్చి రాజ్యంబు
రంపంబంచు దలంచలేక కవులన్ రాజ్యాంధతన్ బొందరీ
సంపత్పూర్ణలు బండితాళి కెదురై సౌఖ్యావలిన్ బొందిరా.

నారాజ్యము నేను సంపాదించుకొందునన్నమాట యేస్వామిా

భీమ—మంచిది సకలైశ్వర్య సిద్ధిరస్తు

రాజు—స్వామిా శెలవు.

భీమ—మంచిది. రంగం

(విక్రమదేవు-మంత్రి సామంతులతో)

విక్రమ—మంత్రీ జన్మమన్న మన సియాళి దండనాధునిదే సుమా తనువు లశాశ్వతమని ఇహ సుఖముల కాసింపక తపోవనము నకు జనె. కాని వెళ్ళువాడు వెళ్ళగా, కళింగరాజును విడచి నాడట ఆతడు మరల యేరాజులనైనను జేర్చుకొని మనపై దండెత్తునేమో యని దలంచుచుంటిని.

మంత్రి—ప్రభూ కళింగరాజు చనిపోయియే యుండును లేకున్న దేశాంతర వాసమున నైన యుండవచ్చును కాని యీచుట్టు ప్రక్కల మాత్రము లేదు తమరు భయమొంద పనిలేదు

విక్రమదేవు—భయమేల మనదాటికి యేచక్రవర్తియు ఆగలేడు ఆగడు, రాడు.

మంత్రి—దేవా మన వంగరాష్ట్ర మెవరు పాలించుచుండిరి?

విక్రమ—అమాత్యవర్యా వంగరాష్ట్రము సరియైన సామంతులులేక నా పెద్దకుమారుడు నానందదేవుని పట్టాభిషిక్తుని జేసితిని ఆతడు బాలుడు కొంతకాలము వరకు చిద్విలాసముగా యుండు సమయమున యిట్లు చేయవలసి వచ్చినది యేమి చేయను.

మంత్రి—మంత్రులుండిరిగదా బాలుడైన నేమి ప్రభూ ?

విక్రమ—మంత్రీ పగటివేషగాండ్రు యీ దేశమున గలరా ? ఉన్న కబురంపుడు చూచి చాలాకాలమైనది

సేవ—పగటివేషగాండ్రు వచ్చియుండిరి సెలవా

విక్రమ—తక్షణము వేశాములతో ప్రవేశింప జేయుము

మంత్రి—అనుకొన్నమాత్రమున వచ్చిరి నాకు మహాఆనందముగా యున్నది.

మంత్రి—యిట్టి భోగలాలసులగు ప్రభువు లుండుటచేతనే రాజ్యములు నానా తెన్నులగుటకు కారణము. ప్రజలమొరలు వినక యెప్పుడు భోగములేగదా. యీతనికీ రాజ్యమెట్లు నిలచును. మాపరిజలు ఎట్లు బ్రతుకుదురు. పూర్వము మా మహారాజు దేశము ప్రజలు దేశము ప్రజలు అని ఆరాటమును నొందెడి వారు మా ప్రజలు దురదృష్టులగుటచేతనే యీమహారాజు రాజ్యపద భ్రష్టులగుట యీతడు రాజగుట తటస్థించినది. ఆమహారాజునకై ఎంత వెదకించినను జాడలైన అగుపించుట లేదు. ఏమి చేతును.

విక్రమ—మంత్రీ ! ఆలోచించుచుంటివేల?

మంత్రి—ఏమియు లేదు. ప్రభూ! తమరింత మహానందమున వాల లాడుట జూచి ఆశ్చర్యము గల్గుచున్నది.

(పగటివేషగాండ్ర భామవేషము రాజునకు నమస్కరించి)

పల్లవి॥ సఖుడ నిన్నే వలాసితి సమయ మిదే వేగ రారా ॥స॥
నిఖల జగము లరసి వచ్చితి నీవె నాకు దిక్కురారా ॥స॥
మరులు కొంటి వేగరారా మంచిదటరా చేరదియ్యరా ॥స॥
అరలు మరలువేసిదానను ఆశతో నినుగూడ వస్తి ॥స॥
ప్రభూ! భామ వేషమునకు పాతవస్త్ర మిప్పించవలయును.

వెంకన్న—పాతవస్త్రమేమిటి? ప్రభూ వారిని క్రొత్తవస్త్రములు గోరక సత్యభామ.

విక్రమ—ఆహా! అచ్చముగా భోగముపిల్ల లాగున నున్నదీ వేషము యిదిగో. చీర మీామీా వేషములు పూర్తిగా వేసి సన్మానం దింపజేసిన గొప్ప బహుమతు లిత్తును.

వెంకన్న—చిత్తము ప్రభూ!

బుడబుడక్కలవాండ్రు.

అంబాపల్కు జగదంబాపల్కు కాళీపల్కు ఓంకాళీపల్కు.

చిడతలబుడ్డి వాండ్రు

గాజు లెయ్యవ్వే మారమాగాజులు గలగలలాడించే ఎయ్యి గాజులెయ్యి.

మందులవాళ్ళు.

వాతనొప్పులకు పక్షవాతములకు కీళ్ళనొప్పులకు చచ్చు వాతములకు.

(యివ్విధముగా వాళ్ళవాళ్ళ వేషములు వేసి మెప్పించ ప్రజలు ప్రభూ ఆనందమున చూచుచు.

విక్రమ—నటకులారా! మీామీా ప్రజ్ఞాప్రభావములు చూపి మమ్ముల మెప్పించితిరి. ఇక నొక్కవేషము వేయవలయును, అట్లా వేషము వేసి మెప్పించిన గొప్పగా బహుమతులిత్తును. అదే దన, కళింగగంగు వేషము వేయవలయును. ఆ వేషమే వేసి యొప్పించిన వెయ్యి నరహాలు బహుబమతి చేయదలచినతిని.

నటకులు—చిత్తము.

సుగు, మంత్రి—ఆ మాకళింగమహారాజును అన్యాయయుద్ధమొనర్చి రాజ్యమాక్రమించినదిగాక. ఆమహామహుడు ప్రవాసమందు చుండ అట్టి వేషము వేయించి హేళనచేయ నూహించుటా తులువా? (వినాశకాలే విపరీత బుద్ధిః) అన్నట్లు ఈతనికీ చెడు కాలము దాపురించినది. యిప్పటికే ప్రజలయం దవిశ్వాసము

రేకెత్తినది. మహామహుఁడగు కళింగభూపతి పోవుటచే అరాచకము ప్రబలినది. యిప్పుడా వేషముచూచిన ప్రజలూరుకొనరు. తిరుగుబాటుచేయుదురు అప్పటికిగాని యీప్రభువు భోగలాలసము లంతరించవు. లేకున్న సాటిమహారాజు నవమానపరచుట తగునా ?

విక్రమ—మంత్రీ సుగుణసాగరా! వీరలకు కావలసిన పరికరములిమ్ము.

నటి—మహాప్రభూ తమ ఆజ్ఞ బద్ధులము సెలవు.

విక్రమ—సరే త్వరగారండి.

నట—ప్రభూ ! ఆరాజ వేషము వేయుటకు నెలగడువు యిప్పించవలెను. ఎందుకన ఆరాజ వేషము కుదురులాగున ప్రాక్టీసు సేయవనియును.

విక్రమ—మంచి దట్లే చేయుము.

(రంగము)

వెంకన్న—సూరన్నా ఏమిచేద్దామురా మహారాజుచూస్తే కళింగ రాజు వేషము వేయాలంటాడు. వప్పుతున్నాననుకో. ఆ రాజుని మనమెప్పుడూ చూడలేదు. ఎట్లాగరా.

సూరన్న—ఎందుకొప్పుకున్నావురా.

వెంక—ఒప్పుకోకపోతే యేం చెయ్యమన్నావురా. మహారాజులు దగ్గర. మాటలు అలాగేఅనకపోతే మాటలు పడివలసివొస్తుంది.

సూర—అలాగైతే ఆలోసించు మరి.

వెంక—ఆలోచన కేముందిరా యీ వేషమువేసేవాళ్లు యెవరైనా ఉంటే నూరువరాలిస్తామని టముకేయిస్తే యెవడైనా సిద్ధపడతాడు. అంగుదార్లము మనమున్నాముగా.

సూర—అవునుర్రా బలేబాగుంది నీయాలోచన.

వెంక——అలాగయెత్తు వేయకపోతే ముందుచేసినపని ముక్కలాడి చేతులు దులుపుకొని యింటికెల్లవలసిందే.

సూర——మాదిగవాడిని పిలుచుకున్నావా.

వెంక——ఊఁ. వెళ్ళుము నేనుచెప్పినట్లు టము కేయించుము.

మాదిగవాడు——టముకువేస్తు.

పాట

ప॥ ఆలకించండయ్యా పెద్దయింటివానిపలు ॥కా॥

అ॥ మేలమీదైదరేల మీకన్న పెద్దవాణ్ణి ॥ఆ॥

1. జాతులేవి యెన్నగాను ఆడామగవాను గాని
నీతిమాలిన దోషులంత జాతులేర్పచెగాని ॥ఆ॥

2. జాబాలివసిష్ట నారద మాతంగాది సానగ సనందనాది సత్పురుషు లెవ్వరయ్యా ॥ఆ॥

యికను సమస్తజనులకు తెలిపేదేమంటే కళింగగంగు మారాజేసం యేసినోళ్ళకి నూరు వరాలిస్తారంట. యేసేవాళ్ళెవరైనా ఉంటే రావల్సిందోహో.

బ్రాహ్మ——ఏమిరా మీదుమీదునకువచ్చి టముకేస్తున్నావేమిరా పశువా దూరంగాఉండరాదు.

మాదిగ——ఏమిటి బాపనయ్యగారు పశువునా? మనకన్నా పశువులేనయుం టెన్నుకోవు. లంచాలులేవు. కుంచాలులేవు. దీర్ఘవిరోధాలులేవు. వెనకాశాలేదు. ముందరాశాలేదు. తక్కువాలేదు. ముందూలేదు. వెనకాలేదు. అన్నిపశువులు అన్యోన్యముగా యుంటూ మనలో ఎక్కువా. తక్కువా ఆశ దురాశ క్రోధమ్ము మోహాము దుఃఖము తిరిపెము తిరగటము యిన్నిలచ్చనాలున్న పశువులం మనం బాపనయ్యా! ఇన్నావు అన్ని జాతుల్లోన మనజాతి యెక్కువగనకే మనమాంసంయేదీకానదు

తింటేమతోతుంది. ఎక్కువేంటి తక్కువేంటి చెప్పు. అందరు తినేదొకటే. అందరిశరీరాలొకటే. వేరువేరులేదుగా పుట్టేం ఒకేలాగు తింటన్నాం నడుతున్నాం అంటున్నాం చేత్తున్నాం నిద్దరోతున్నాం పెళ్ళింపిల్లలతో కాపరాలు చేత్తున్నాం అంటున్నాం పడుతున్నాం గోప్పోరంటున్నాం గోతులోపడుతున్నాం రుసులజాతంటారా తలోకరికి పుట్టేరంటున్నా శాస్త్రాలు పురాణాలంటారా అవిఅట్టివే మనుచులిది తలో మతం తలో దారి యిదంతా తందనాలదారంటాను. జాతులేమిటి నామొకం. పద్దిమిదిశంఖన చిత్తిని అత్తినిజాతులునాలుగు అన్నిజాతులకు అంతే కడక్కు చూచుకుంటే ఆడమగ జాతులేంటి ఆచారాలేంటి నిరాశారాలేంటి శబ్బరంగా ఉన్నాడేమంటోడు ఏమంటాబామ్మడా. నిజముసెప్పు అంతేనా (ప్రజలుమూగ) యిదంతా నిజమేరా నిజమే మనపెద్దలాలాగ నియమించేరు. ఏమిచేయము. లేకపోతే పనులు జరగొద్దూ.

ఆమూభాగాచెప్పేరు. బాబు యిలాగుంటేగాని పనులులోట్టాయా యిన్నికులాలుంటేగాని బుర్రలు రామకీర్తనలు బాడించుకోంటానికా చాలుచాలు మామంచి బాబులు యిదంతాశకరయ్య రామానుజయ్య మాధవయ్యతీసుకొచ్చిన తంటాలు మునుపు అందరూ ఒకటేనని పురాణాలు చూల్లేదు గట్టిగా అంటే బారతం బొంకు రామేణం రంకు అంటారు. ఆడదిమొగోడు లేకుండా పుట్టినోడుంటాడా. ఆలా అందరూ పుట్టేరే ఎక్కువతక్కువేంటి నిదానించండి మారాజులు.

కళింగరాజు—(ప్రవేశించి) ఆహా !

ఉ. కాంచనచేలమున్ మణులు గల్గిననాడె యొకప్పుడింతలో
గాంచడె సర్వభూషలను కాలగతిన్ గనజాల డెవ్వడీ

మంచిచెడుల్ దలంపగను మానవసాధ్యమె యెంచిచూడగా
అంచితకాలపాశమున కందరుబద్ధులుకారెపృథ్విలో.

ఔను కాలమనుపాశమునను బద్దులుగాని వారెవరు. అంతయు ఈశ్వరసంకల్పమేగాని వేరుగాదు. సర్వేశ్వరసంకల్పమమోఘము. కోలుత మహారాజ తదుపరి అన్నాతురుడు ఆవెనుక కించిత్తు సంతోషము. మరలవిచారము. యొకపరిక్రోధము. యొకపరి నిరుత్సాహము. యొకపరిబాధలు. యొకపరిహాహాంభావము యొకపరి మోహము. దుఃఖము యిన్ని బాధలుతో గూడుకొన్న మానవదేహము ఆమహామహుడు యెందులకు సృష్టించనోగదా తెలియదు. జగన్నాటక సూత్రధారియొక్క విధానమిదియేకాబోలును. అదుగో ఆప్రక్క జనులుగుమి గూడియుండిరి. ఆచిత్రమునరియుదునుగాక. యీకళింగ రాష్ట్రము నేను వెళ్ళినది మొదలు ప్రజలు నిరుత్సాహముగా నగుపించునట్లగుపడుచున్నారు. కారణము యేమై యుండును. కారణమునకేమున్నది. రాజ్యపరిపాలనా సమర్థత అసమర్థతగాయున్న ప్రజలు నిరుత్సాహవంతులగుట కేమి లోటు, ప్రజలేకమైన ప్రభులేమిచేతురు. భయోత్కంపిత మానసులై చాలునదాగొని మరింతప్రజలనురెచ్చగొట్టుదురు. వారల నంతరింప జేయ ప్రజలు తలంతురు అరాజకము ప్రబలక మానదు, యిది యంతయు నాకేల దరిద్రునకు తాహతు మీరిన ఆలోచన లందు రిదియే గాబోలు అదుగో అడిగెద కాక అబ్బీ యీాటమటము యెందుకు ఎమిటీ సంగతి.

మాదిగ—ఏముంది రాజ కళింగ గంగు మహారాజు వేషమేసి నోళ్ళకు నూరువరాలు బహుమతట చూచుకో యెయ్యదల చుంటే.

రాజ—ఔరా రాజ్య మదాంధత! నారాజ్య మపహరించి నన్ను హేళన చేయుటకా యీవేషము. సరే యేమనుకొన్న యేమున్నది. ఆవేషము నేను వేసిన నూరు వరాలు వచ్చును గదా కొంత హీనస్థితి తగ్గును వేసెడగాక వీలు చిక్కిన వాని తల ఖండింతును. లేకున్న నూరు వరాలు వచ్చును యేవిధముననైనను మంచిదే. అబ్బీ నూరు వరాలిచ్చే వారెందున్నారు. నేను ఆవేషము వేయగలను.

మాదిగ—అదుగో ఆచాయ నగపట్టల్లే ఆసందులో మకామున్నారు అక్కడడుగుపో. (నిదానించి) అదుగో వారు యీలానే వత్తున్నా రదుగు.

(వేషగాండ్ర డరియంజని కళింగరాజు)

బాబూ మీరేనా, కళింగరాజు వేషము వేసిన నూరు వరాలిచ్చెద నని టముకేయించినవారు. (నటకులు) ఔను మేమే వేషము వేయగలవా యేమిటి

రాజు—ఆతప్పక వేషము వేసి పాడగలను

నటకులు—ఆరాజును చూచితివా లేకున్న మాటవచ్చును లాభము సున్నయగును.

రాజు—ఆరాజును పూర్తిగా యెరుగుదును ఆరాజును పోలినవాడనే నేను. మావాళ్ళందరు అలాగే అనేవారు రాజకళింగమహారాజులా గుంటాడురా వీడని.

నటకులు—అలాగైతే రా పోవుదము (అనిపోదురు)

రంగము—విక్రమదేవుని సభాస్థానము

విక్రమ—మంత్రి సుగుణ సాగరా యీకళింగ రాజ్యమున గల్గు వ్యవహార ధర్మములు నాకు అగమ్య గోచరములుగా యున్నవి ప్రజలు ప్రభుత్వపు టుత్తరువులు విశ్వసించుట లేనట్లు అగపడుచున్నవి

సుగుణసాగరుడు—ప్రభూ పూర్వపురాజు ప్రజాయత్త రాజ్యము చేసి నామకమునకు రాజుగా వ్యవహరించిరి ఆపరిపాటు పోవునా

విక్రమ—మనసైన్యముల బంపి గుణమర్దన చేయించిన గాని చక్క బడదు గాబోలు

సుగుణ—అది న్యాయము గాదు ప్రజలకు ఇష్టము గల్గులాగున పరిపాలన సాగింపవలయును లేకున్న రహస్య యుద్ధమొనర్చి మనకే ముప్పుదెత్తురు.

సేవకు—మహారాజా పగటి వేషగాండ్రు వచ్చుచున్నారు

విక్రమ—త్వరగా ప్రవేసింపజేయుము.

నటకులు—మహారాజా వందనములు

విక్రమ—(కళింగగంగు వేషముజూచి భయముతో చూచుచు) అరెరే నిజముగా కళింగగం గనుకొంటిని. వీళ్ళు పగటి వేషగాండ్రు (నవ్వుచు) బాగుంది. అచ్చము కళింగగంగే! కానివ్వండి బలే తమాషాగా యుంది.

నటకులు—ప్రభూ సెలవా

విక్రమ—ఊఁ కానియ్యండి

సుగుణ—నిదానించి చూచి ఆత్మ నమస్కార మాచరించి చిరునవ్వు నవ్వకను సైగచే సుగుణ సాగరుని వారించి నిలచుని యుండ.

నట—ప్రారంభించవయ్యా.

మృదంగాది వాయిద్యములతో పాడుచుండ

[గుర్రము నిటునటుద్రిప్పుచు ఖడ్గము జళిపించుచు]

ప॥ రాజకళింగగంగు వచ్చెనల్లదుగో ॥రా॥

అ॥ పౌజులనువీక్షించినవ్వుచు పారజూచుచుకటములదరగ ॥రా॥

చ॥ రాజవిక్రమ దేవరాజుతో రాతిరీపవలనియు దెలిక

వాజుగాశ్రమపడక యుద్ధము దప్పదని కదుశౌర్యమొందుచు॥

1. వాసిగా శ్రీకాపవరపుర వాసుడైన సత్యలింగని
బ్రోచియును రక్షించిగాచిన ఘనుని వీరాభద్రుదలచియు॥రా॥
అనిపాడుచు ఖడ్గమును త్రిప్పుచు యిదేసమయము తనయత్న
ములోయున్న యీవిక్రమదేవుని యీఖడ్గమున కెరజేసెద
గాక. పైనదైవమున్నాడు. (అని విక్రమదేవు శిరము దెగ
నరికి శవము నీవలకులాగి పాతమంత్రులు ప్రజలేగనుక వారల
జూచి) మంత్రి సామంతసర్వపజాప్రముఖులారా పారిపోకుడు
పోకుడు. నేను పగవాడనుగాను. పూర్వపురాజగు కళింగమహా
రాజితండే. నిదానించిచూచి, మీప్రభుని తప్పులున్న మన్నించి
నన్నుదయచూడుడు. రహస్యయుద్ధమొనర్చి నన్ను నానా
శ్రమలుగల్పించెను. నేనును రహస్యముగా యీతని అంత
మొందించిని. రాజకీయపుమర్యాదలు మీరెరుంగనివేమున్నవి;
నిదానించుడు.

ప్రజలు—ఆశ్చర్యముతో ప్రభునకు నమస్కరించి, జై కళింగమహా
రాజునకు జై ॥

సుగుణసాగరుడు—ప్రజలాలా! సకలకళాప్రపూర్ణులును, యాచక
జనపోషణ బిరుదాంకితుడును, సర్వజన దయాప్రపూర్ణుడును,
నిర్విక్రపరాక్రమోపేత శౌర్యధైర్యగాంభీర్యాది సదసద్వివేక
వంతుడును మహీమండలాఖండల దిగ్విజయ శూరజనాను
రంజకుండును అగు మన మహారాజు అకస్మాత్తుగా యుద్ధమున
మాయగా పట్టువడి నాచే రహస్యముగా విడువబడి నానా
శ్రమలుపడి యేమహాకవిచే శాపమునొందెనో ఆమహాకవిచే
శాపవిముక్తినొంది రహస్యముగా వచ్చి విపరీతబుద్ధిచే ఈచని
పోయిన రాజునకు హేళనచేయవలయునని యీ మహారాజు
వేషము వేయించ సమయమునకు యీ మహారాజువచ్చి

వేషము తానే ధరించి ఒక్కడైన ఈరాజునంతమొందించెను. యిదియంతయు భగవన్మాయగా తలంపవలయును. ఏలనన మనలనే సర్వము పరిపాలించ నిర్ణయించి తాను రాజై పాలించుటచేతను తనపరివారము లేకుండుటచేతను యిప్పుడీమహా రాజు వానిని జంపి రాజార్హుడయ్యెగాన నీమహారాజునే సర్వప్రజలు మహారాజని మన్నింతురుగాక. జై కళింగ మహారాజునకుజై (అన అందరు జై జై శబ్దములు చేతురు.)

[పుష్పమాలాలంకృతుని జేతురు భార్యలువచ్చి నమస్కరించ ఆనందబాష్పములు గురియ కరంబువట్టి నిలచుండ]

సేవవ—భీమకవి సార్వభౌములువచ్చుచున్నారు దేవా! అవదారు.

రాజకళింగగంగు—యేరీ! యేరీ! యెంతదూరమునన్నున్నవారు (అని సింహాసనముడిగ్గ నురికి) జని యెదురుగావచ్చి కవిపాదములపై బడి.

ఉ. నీకరుణావిశేషమున నేటికి నాదగు రాజ్యమంతయున్
చేకురునంచు దెల్పితొ జెప్పెడిదేమి మహాత్మ యింకనే
పోకలుబోక మీకరుణాపూర్తిగ నమ్మి చరించువాడనో
భీకరమూర్తి భీమకవి ప్రేమసుధారసధార గావుమా.

మహాత్మా! నీప్రేమసుధారసధారలచే యిప్పటికి నానా సౌభాగ్య సంపదలతో నొప్పు నింపుగల్గు రాజ్యలక్ష్మి నాచే నిప్పటికి చిక్కినది. రండు (అని తీసుకొనివెళ్ళి సింహాసనమున గూర్చుండబెట్టి పాదపూజచేయుచు.)

ఉ. భీమవరప్రసాది ఘన భీమకవీంద్రమ చంద్రమాయనన్
ప్రేమను సర్వమానవులు ప్రీతిజనింపగ ధారుణీపతుల్
నీమహిమాన్వితుల్ వినియు నెమ్మనమందున నాశజేతురా
ధీమహితాప్రభావు ఘన దివ్యపదంబులు నొత్తు భాగ్యుడన్.

భీమకవి—రాజా! నీభయవినయ భక్తిపూజలకు మనంబానందా యత్తమగుచున్నది. సకలైశ్వర్య సుఖసంతసముగానుండ (కళింగరాజుశిరంబున చేయిడి.)

శ్వేతా !

సీ. శ్వేతవాహనఘన శ్వేతవాహనఘన
శ్వేవాహనులెల్ల శ్రీలొసంగ
శ్వేతవాహనఘన శ్వేతవాహనఘన
శ్వేతవాహులునీకు సేవలొసగ
శ్వేతధారణఘన శ్వేతధారణఘన
శ్వేతధారులుఘన శ్రేష్ఠుడనగ
శ్వేతధారణఘన శ్వేతధారణఘన
శ్వేతధారణులెల్ల చిరంజీవియనగ

గీ. సర్వదేవత నిచయంబు సంతసింప
ధరణినీకీర్తి శాశ్వతకరముగాగ
బ్రోచిరక్షింపవెలయుగాం పూర్ణకృపను
రాజరాజకళింగ భూరాజవర్య.

శఖు—తథాస్తు! నాకుదీర్ఘాయురస్తు. సర్వజనరంజకామోదరస్తు. దుష్టపరిపాలనా ప్రభుత్వానాశనాస్తు. యేకసంఘీభావజన సమ్మోదనాస్తు. ఆంధ్రమాతా దుఃఖవిముక్తరస్తు. దరిద్ర నారాయణ జనపోషణస్తు. నవభారతరాజ్యాంగ సౌభాగ్య సిద్ధిరస్తు. ఆశాపాశ లంచదళారీ మోదమారణహోమరస్తు. శ్రీరస్తు. అవిఘ్నమస్తు శాంతిరస్తు. పుష్టిరస్తు. శ్రీఘమే దుష్టశిక్షణ సుజనరక్షణ శాశ్వతైశ్వర్యరస్తు. శ్రీరమామనో హర ప్రేమసుధారసప్రాప్తిరస్తు. తథాస్తు.

కళింగ—దేవా ! తమఆశీర్వచనప్రభావం బనన్య స్తవనీయము. ఈ దీనునిరక్షించి కాపాడి యిట్టిమహోత్సవమందునట్లు జేసిరి. (అని నమస్కరించ భీమకవి రాజును సింహాసనముపై గూర్చుండబెట్టి రాజ్యాపట్టాభిషేకముగట్టి) జై కళింగమహారాజునకు జై.

మంగళగీతము.

భీమ—రాజా ! నీకేమి కావలయును.

రాజా—తమ నిర్హేతుకజాయమానకటాక్షముచే అన్నియు సమకూరినవి. కోరమంటిరిగాన

ధరణి సస్యసమృద్ధిగా తరలుగాక
ప్రజలు భూపులు చల్లగాఁ బ్రతుకునట్లు
ఆయురారోగ్యసంపదల్ అలరుగాక
తరుగదీకీర్తి ఆచంద్రతారకముగ.

అందరూ—తథాస్తు !

పంచమాంకము సమాప్తి.



బాక్సుముద్రాక్షరశాల ; రాజమహేంద్రవరము.

